# మాలతీమాధవము

మహాకవి భవభూతి విరచిత సంస్కృతమునుండి

కైలాసవాసి

జనమంచి వేంకటరామయ్య

ఆంధ్రీకరించినది.

ప్రకాశకుడు
జనమంచి రామకృష్ణ
మద్రాసు.

Prescribed as a Text for the B. A. degree Examination
of the Madras University 1948, Vide Ft. St.
George Gazettee Supplement dated
3rd April 1945 Page 6.

తృతీయ ముద్రణము
1946

వెల
రు 2 8 0.

# ఈ నాటకమందు వచ్చు పాత్రములు.

---

### పురుషులు

**మాధవుఁడు:**—విదర్భరాజు మంత్రియైన దేవరాతుని పుత్త్రుఁడు.
మాలతికిఁ బ్రియుఁడు - కథానాయకుఁడు.

**మకరందుఁడు:**—మాధవునికి బాలమిత్త్రుఁడును సహచరుఁడును;
మదయంతికకుఁ బ్రియుఁడు.

**కలహంసుఁడు:**—మాధవుని సేవకుఁడు, మందారికకుఁ బ్రియుఁడు.

**అఘోరఘంటుఁడు:**— ఒక కాపాలికుఁడు.

### స్త్రీలు

**మాలతి:**—పద్మావతీశ్వరుని మంత్రియైన భూరివసువు కూఁతురు.
మాధవునకు వల్లభురాలు. కథానాయిక.

**మదయంతిక:**—మకరందునకుఁ బ్రియురాలు - పద్మావతీశ్వరుని వేడుక
చెలికాఁడైన నందనుని చెలెలు.

**లవంగిక:**—మాలతికి దాదికూఁతురు.

**కామందకి:**—వృద్ధబౌద్ధయోగిని.

**బుద్ధరక్షిత**
**అవలోకిత** } కామందకియొక్క శిష్యురా
**సౌదామిని**

**కపాలకుండల:**—అఘోరఘంటుని శిష్యురాలు

**మందారిక:**—కలహంసుఁడుంచుకొన్న విహారదాసి.

వీరుగాక పురుషుఁడు, ప్రతీహారి మొదలయినవారు.

***

# పీఠిక.

మాలతీమాధవమను నీ ప్రకరణ మిప్పటి కించుమించుగాఁ బండ్రెండు వందల యేండ్లక్రిందటి సంస్కృతభాషలో భవభూతియను మహాకవిచే విరచింపఁబడినది. ఈ కవి జన్మభూమి దక్షిణాపథము (Deccan) నందలి పద్మపురము. ఇతఁడు కాశ్యపస గోత్రుఁడైన యుదుంబర బ్రాహ్మణుఁడు; శుక్ల యజుర్వేది; యితని తాత భట్టగోపాలుఁడు; తండ్రి నీలకంఠుఁడు; తల్లి జతుకర్ణి; జ్ఞానవిద్యాచార్య డితని గురువు. ఇతనికిఁ గవితాప్రావీణ్యమునుబట్టి శ్రీకంఠుఁడని బిరుదనామమే కాక తర్కవ్యాకరణమీమాంసాశాస్త్రములయందలి నైపుణ్యమునుబట్టి పదవాక్యప్రమాణజ్ఞుఁడని ప్రఖ్యాతియుఁ గలిగెను. ప్రస్తావనయందలి యేడవ పద్యమునుబట్టియు, సాధారణముగానే లొక్కవిక్రతము లని పండితులచేఁ జదువఁబడు "మహాదాక్షిణ్యానాం కతిపయపదానాం రచయితా &c., నాస్మాకం శిబికా నాపి కటకాద్యలంక్రియాసత్క్రియా &c.. నాసీయం తేమునసి మధుపాకపారిజాతకుసుమస్రజా &c.'' ఇత్యాది శ్లోకములనుబట్టియు నీ మహాకవి స్వాతంత్ర్యము గలవాఁడని స్ఫురించుచున్నది.

ఈ కవికి జన్మభూమియని పైఁ జెప్పఁబడిన పద్మపుర మిప్పుడు 'బిరారు' లేక 'బీడరు' అని వ్యవహరింపఁబడెడు విదర్భదేశములోనిదై యుండవలెను. అందుకు నిదర్శనముగా నీ కవి యిందలి నవమాంకములోను ఉత్తరరామచరిత్ర మధ్యమాంకములోను జూపిన తత్పరిసరగిరిసరిదరణ్యాది విషయికమైన ప్రకృతివర్ణనాసామర్థ్య మనన్యసామాన్యముగా నున్నది. అట్టి సామర్థ్య మెంతటి మహాకవులకైనను వస్తువులతోడి ప్రత్యక్షపరిచయము వలనఁ గలుగవలసినదే కాని కేవల కల్పనైక సాధ్యము కానేరదు.

ఇంతవఱకు కవియొక్క కులగోత్రాదులను దెలిసికొనుట కతఁడు రచియించిన నాటకములును వానిప్రస్తావనలును నాధారకము లయినవి. కాని ఇతనికాలమును నిర్ణయించుటకు సాధనాంతరము లపేక్షణీయములై యున్నవి. భోజరాజున కవ్యవహితముగా వెనుకఁ బరిపాలించిన ముంజరాజు కాలములో అనఁగా క్రీ. శ. పదునొకండవ శతాబ్దములోఁ దదాస్థాన కవియగు ధనికునిచే రచింపఁబడిన దశరూపకమను నాటక లక్షణ గ్రంథ మందు మాలతీమాధవాదులలోని శ్లోకము లుదాహరింపఁబడుటచేఁ భవభూతి పదునొకండవ శతాబ్దమునకుఁ బూర్వుఁడని స్పష్టపడుచున్నది. ఇంక నీ శతాబ్దమున కెంతపూర్వుఁడో యనునంశము విచారింపవలసియున్నది. అందున కాధారము లేకపోలేదు. భవభూతి, క్రీ, శ. ౭౩౦ సంవత్సరమునకు ముందో వెనుకనో పాంచాల (Kanouj) దేశమును బరిపాలించిన యశోవర్మయొక్క యాస్థానకవిగా నుండినట్లు కాశ్మీరదేశ చరిత్రమువల్లఁ దెలియుచున్నది. కాఁబట్టి యితఁడు క్రీ. శ. ఎనిమిదవ శతాబ్దమం దుండుటే సిద్ధాంతము. ఈ కవికాల మదియే యనుటకు ఈ నాటకమే కొంతవఱకు సాక్ష్య మిచ్చుచున్నది. ఇందు రాణివాసపుస్త్రీలు మహామ్మదీయుల ధూర్తవ్యాపారములవలని భయమునుగాని నిర్బంధమునుగాని యెఱుఁగని వారై తమ యిచ్చవచ్చినచోటుల స్వైరముగా విహరించు వాడుకగల వారుగాఁ జెప్పఁబడినారు. ఆకాలము మహామ్మదీయుల దండయాత్రలతోను హిందువుల పరాభవములతోను నిండిపోయిన 10_11 శతాబ్దముల కంటెఁ బూర్వకాలమే కాకపోయినయెడల భవభూతి యంతఃపురకాంతల కింత స్వాతంత్ర్యము నే యిచ్చియుండఁడు. ఇందు సూచింపఁబడిన యాచార వ్యవహారాదులుకూడ విదేశీయ సంపర్కమును బొరయనివిగా నున్నవి. మఱియు బౌద్ధపరివ్రాజికలచేత నంతఃపురస్త్రీలకు సంగీతాదికళలు నేర్పించు వాడుకయు కాపాలిక మతస్థులు శక్తికి నరబలులు సమర్పించు నాచారమును యోగాభ్యాస శివలింగపూజా ప్రాచుర్యమును ఇవియన్నియుఁ బూర్వోక్తకాలలక్షణములుగానే యెన్నఁదగియున్నవి.

## కథాసంగ్రహము

పూర్వము విదర్భరాజు మంత్రి దేవరాతుఁడును పద్మావతీశ్వరుని మంత్రి భూరివసువును కామందకి యను బౌద్ధయోగినియు నొకే గురువునొద్ద విద్యాభ్యాసము చేయుచున్న కాలమందుఁ బూర్వోక్త మంత్రు లిరువురును చేతఁ జేయివైచుకొని "మనమవశ్యము వియ్యమందవలయును" అని కామందకియుఁ దచ్ఛిష్యురాలు సౌదామినియుఁ జూచుచుండఁగాఁ బ్రమాణము చేసికొనిరి. ఆ వెనుకఁ గొన్నాళ్ళకు దేవరాతుఁడు కుండినపురము (కొండవీటి) నుండి పద్మావతీ పురమునకు నీతిశాస్త్రమును జదివించుకొనుటకుఁ దనకుమారుని మాధవునిఁ దద్బాలమిత్రుఁడైన మకరందునితోఁగూడఁ బంపెను. ఆ కాలమందు మాలతి

ఉ. మారులయెత్తు మేడపయి ♦ సోరణగండి వసించియుండి యా
చేరువ రాజమార్గమునఁ ♦ జీటికిమాటికిఁ బోవువాని సా
కారతఁ బోల్చు కామురతి ♦ కైపడి మాధవుఁ జూచిచూచి తాఁ
గోరిక లూరఁ దాపమునఁ ♦ గుంది కృశింపఁగఁ జేయు నంగముల్.

అన్నట్లుగా నుండి యొబుసుపోకకై యాతని యాకృతి లిఖించి చిత్తరువును దన ప్రియసఖియైన లవంగిక కిచ్చెను. అదియును మాధవానుచరుఁడైన కలహంసుని ప్రియురాలగు మందారిక చేతి కిచ్చెను. ఆ మందారికయు నా చిత్రపటమును దనప్రియుఁడు దొంగిలిపోఁగాఁ దిరుగఁ దెచ్చుకొందునని బైలుదేఱి వచ్చి కామోద్యానములో నొక్కదిక్కున మాధవునిం జూచెను. అప్పు డతఁడు నాఁటియుదయమే యందలి కామాలయమునొద్ద సఖీజన సమేతురాలయి కామోత్సవమును నిర్వర్తించుటకై వచ్చియుండిన మాలతినిం జూచి మనసుపడ్డవాఁ డగుటచేతఁ, దా నొకచెట్టునీడను నడుమనడుమను బొగడదండఁ గ్రుచ్చుచున్న ట్లుండి మాలతినిం జూచుటయుఁ దన్ను మాలతి సూచుటయుఁ దాఁ గూర్చిన మాలికను మాలతి కింపుగా నుండునని

లవంగిక వచ్చి తన్నడిగి పుచ్చుకొని చనుటయు మొదలుగాఁగల యచ్చటి ముచ్చటలన్నియుఁ బూసగ్రుచ్చిన వడువునఁ గలహంస మకరందులతో నచ్చిక మచ్చికగాఁ జెప్పుచుఁ బ్రొద్దు పుచ్చుచుండెను. ఈ సమయమున మందారిక వారిం జూచి నమస్కరించి 'నాచిత్రపటమునిమ్మ'ని కలహంసు నడుగఁగా వాఁడును "ఇదిగో పుచ్చుకొమ్మ"ని యామెచేతి కంతకు ముందే మకరందప్రేరణమున మాధవుఁడు లిఖించిన మాలతీరూపము నిచ్చెను. మందారికయుఁ జిత్రపటముతోఁ బాటు దానిభావమునుగూడ గ్రహించి వీడ్కొని యా వస్తువును లవంగిక చేతి కిచ్చెను. అంతట లవంగిక యీ చిత్రపటమును ఆ వకుళమాలికను మాలతి కిచ్చి యింక మాధవానురాగము విషయమున సంశయింపఁ బనిలేదని యామెతోఁ జెప్పెను. మాలతి యా రెంటినిఁ బ్రాణపదముగా ధరించెను. కాని రాజనిర్బంధముచేఁ దండ్రి తన్ను రాజుగారి వేడుకచెలికాఁడగు నందనుకిచ్చి పెండ్లిచేయుట కియ్యకొన్నాఁడని వినియున్న దగుటచే నామెకు లవంగిక చూపిన యనురాగ చిహ్నములవలనను చెప్పిన యాశ్వాసవచనములవల్లను నూఱట గలుగుటకుమారుగా నారటమే యెక్కువ కాఁజొచ్చెను. తనతండ్రికి నిజముగా నట్టి యుద్దేశము లేదనియు, నతఁడు రాజుగారి ముఖప్రీతికొఱకట్లు సమ్మతించెననియుఁ, దన్నుఁ గాదని స్వతంత్రించి తనకూఁతురు రహస్యముగా మాధవుని వివాహమాడినఁ దన కేనిందయు లేకుండును గావున నట్టి సంధానము చేయుమని తన స్నేహితురాలగు కామందకితోఁ జెప్పి యుండెననియు, మాలతికిఁ దెలియనే తెలియదు. ఈస్థితిలో నుండఁగా నామెయొద్దకుఁ గామందకి వచ్చి తన వాక్చాతుర్యముచే మాలతికిఁ దండ్రియెడల నసూయయు, మాధవునియందనురాగమును, నందనునియం దరుచియుఁ, దన యెడలఁ బరమవిశ్వాసమును వృద్ధిచేసెను.

ఇట్లు మాలతినిఁ దనకు వశవర్తినిఁగా దిద్దుకొని కామందకి యొక్కనాఁ డామెను లవంగికాసహితముగాఁ బూలుగోయించు నెపమునఁ

V

కుసుమాకరోద్యానమునకుఁ దీసికొని వచ్చెను. మాధవుఁడును అంతకు ముందే యామె ప్రేరేపణముచే నక్కడ నొక్కపూఁబొదరింట నిగూఢముగ వసించియుండెను గాన, కొంత పరస్పరానురాగ ప్రకటనమైన తరువాత వా రిరువురును నొండొరులం జూచుకోఁగలిగిరి.

'నేఁడు మకరందునిఁ బ్రత్యక్షముగాఁ జూతువుగాని రమ్మ'ని బుద్ధరక్షిత తన్నుఁ బురికొల్పఁగా మంచిదని యామెను వెంటఁబెట్టుకొని మదయంతిక పైఁజెప్పిన తోఁటలోనికి వచ్చుచుండఁగాఁ ద్రోవలోఁ బెద్దపులి యొకటి యామెను బట్టుకొనెను. అప్పుడక్కడకే పయనమై వచ్చుచున్న మకరందుఁ డా వ్యాఘ్రమును సంహరించి మదయంతికను గాపాడెనుగాని పులిగొట్టిన ముమ్మరపు దెబ్బలకు సొమ్మసిల్లెను. చేరువనున్న మాధవుఁ డీ వృత్తాంతమును విని మిత్రుని యవస్థను గని తానుగూడ మూర్ఛఁ జెందెను. అంతట వారిరువురును క్రమముగా మదయంతికామాలతులు గావించిన యుపచారములచేఁ దెలివి నొందఁగా మాధవుడు కామందకి యుపదేశము ననుసరించి తన హృదయమును జీవితమును మాలతికిఁ గృతజ్ఞతాపూర్వకమైన పారితోషికముగా నొసంగెను. ఆ క్షణమునందు నగరమునుండి యొక పురుషుఁడు వచ్చి రాజుగారు స్వయముగానే మాలతిని నందనున కనుగ్రహించి వారన్న సంతోషవార్తను మదయంతికతోఁ జెప్పి యామెను బుద్ధరక్షితా సమేతముగా వెంటఁబెట్టుకొని వెళ్ళెను. పిడుగువంటి యీవార్త చెవినిఁ బడఁగానే మాలతీమాధవు లిరువురును నిశ్చేష్టులయి సకరుణానురాగముగా నొండొరులం జూచుకొని తమ కెంత ధైర్యము చెప్పినను కామందకి మాట యెడ నమ్మకములేక నిరాశులయి తమ సహచరులతో నిజనివాసములకు వెడలిపోయిరి.

మంత్రము సిద్ధినొందిన వెనుకఁ గులరూపగుణసమన్వితయగు నొక కన్యకను దేవికి బలియిత్తునని మ్రొక్కుకొని యా నగరి శ్మశానవాటము చేరువను

గరాళశక్తిగుడిలో నఘోరఘంటుఁడను కాపాలికుఁ డొకఁడు మంత్రపురశ్చ
రణము చేయుచుండెను. ఆ యుద్దేశము ననుసరించి యిప్పు డాతనిశిష్యురా
లగుకపాలకుండల, దుఃఖవివశయై మేడమీఁద నిద్రించుచుండిన మాలతి
నాకాశమార్గమునఁ దీసికొనివచ్చి తన గురువునకు సమర్పింప నతఁ డామెను
బలిపెట్ట సమకట్టెను. కాని యవ్వ డక్షిణసిద్ధికొఱకు శ్మశానవాటములోఁ
బిశాచకోటికి మహామాంస మమ్ముచు సన్నిహితుఁడైన మాధవుఁడు 'హా
మాధవ!' యను నాఁడుకూయి విని యాలయములోనికిం జని యఘోర
ఘంటుని సంహరించి వధ్యశిలపై బలివేషధారిణియై యున్న తన ప్రియు
రాలిం గాపాడి యామెను దిరుగ బంధుజనులయొద్దకుం బంపెను.

ఇదివఱకయిన యేర్పాటు చొప్పున నందనున కిప్పుడు మాలతి నిచ్చి
పెండ్లిచేయవలయును గావున సుముహూర్తమునకుముం దామెను గౌరీ
పూజార్థ మమ్మవారి యాలయమునకుఁ గాముందకి లవంగికాసహితముగా
బంపిరి. వీరు మువ్వురును మంగళవాద్యములతో నూరేగివచ్చి యాలయముం
బ్రవేశింపకముందే మాధవుఁ డందు మకరందసమేతముగాఁ జొచ్చి
యొక్కస్థంభముచాటున నిల్చి వారు వచ్చిన వెనుక లవంగికామాలతుల
విస్రంభాలాపములను విని యానందించుచుండెను. ఇట్లుండఁగా నప్పుడు
మాలతి పువ్వులనక పూజయనక గోలుగోలున నేడ్చుచు లవంగిక కాళ్ళ
మీఁదఁ బడి "చెలీ! నేను బ్రదుకఁజాలను. నాకుఁ జావ నవశ్యయిమ్మ"ని
యామెను బదింబదిగఁ బ్రార్థించెను. లవంగికయు స్తంభముచాటున నున్న
మాధవునికి సైగచేయఁగా నాతఁడు వచ్చి దానిస్థానమునఁ గూర్చుండి దాని
మాటలుగానే "చెలీ! నేనెంతజెప్పినను వినకున్నదానవు. ముందు నన్నొ
క్కసారి కౌఁగిలించుకొని పిమ్మట నీ యిష్టమువచ్చినట్లు చేయుము" అనెను.
అనఁగానే యపరిమితానందము నొంది కన్నుల నీరుగ్రమ్ముటచే నతనిని
లవంగికఁగా భావించి కౌఁగిలించి యాతనితోఁ దన గోడవయంతయు వెడలఁ
బోసికొని కడపట "ఇదిగో నిది మాధవస్వామి స్వహస్తములతో నిర్మించి

యిచ్చిన వకుళపుష్పమాలిక. దీనిని నీవు మాలతినివలెనే హృదయమందు ధరింపఁదగ్గది” అని తనకంఠమునుండి తీసి యాతని హృదయమందు వకుళ మాలిక నుంచుచుఁ జప్పునఁ దొలఁగి భయోత్కంపితయై లవంగిక చేసిన మోసముకదా యని సిగ్గుపడి యూరకుండెను. అంతలో నాలయములోపల నుండి కామందకి వచ్చి యామెను బుజ్జగించి బుద్ధిసెప్పి మాధవునిచే నామెకుఁ బాణిగ్రహణము చేయించెను. మఱియు నంతకుముందు దేవతా సన్నిధానమందు మాలతి నలంకరించుటకై రాజుగారిచే బంపఁబడిన వస్త్రాలంకారములతో మకరందునికి మాలతీవేషము వేయించి యాతనిని లవంగికా సహితముగా వెంటఁబెట్టుకొని వెడలి మంత్రిగారి లోఁగిటిలో నందనునకుఁ బెండ్లిచేయించెను. మాలతీమాధవులును కామందకి సెలవుచొప్పున మదయంతికామకరందుల రాకను బ్రతీక్షించుచు నా చేరువ నొక్క యుద్యానవనములో నవలోకిత సహాయులై యుండిరి.

ఈ యద్భుతపు బెండ్లికై దుదినములు కావలసివచ్చెనో లేక నందన మంత్రి కొకనాఁటిపెండ్లికే మొకమంతయు గాటుక యయ్యెనో మనము నిశ్చయముగాఁ జెప్పఁజాలము కాని వివాహదీక్ష ముగియఁగానే పెండ్లి కూఁతు నత్తవారింటికి గృహప్రవేశము నిమిత్తము దీసికొని వెడలినారని మాత్రము చెప్పఁగలము. ఇది రజస్వలావివాహము గనుకఁ గంకణమోక్షణ మయిన వెనుక వధూవరుల నచ్చటనే యేకశయ్యాగతులం జేసిరి. అప్పుడు కామోద్రేకముచే నందనుఁడు మాలతీ వేషధారియైన మకరందుని కాళ్ళ మీఁదఁబడి యంతవలనఁ గార్యముగాక బలాత్కారమునకుఁ బూని తిరస్కృతుఁడై తిట్టుచుఁ దిమ్ముచుఁ బడకిల్లు విడిచి యవలికి లేచిపోయెను. అంతటఁ దన మాయవదినెగారిని మందలింతునని మదయంతిక బుద్ధరక్షితా సహితముగా వాసభవనముం జొచ్చి యచ్చట మంచముమీఁద ముసుఁగిడి నిద్రించుచున్న కృత్రిమ మాలతినిం బ్రబోధింపఁబోయి దాపునఁ గూర్చున్న లవంగికచే నివారితురాలై యామె కోరినవెనుకఁ దానుగూడఁ బానుపుమీఁదఁ

గూర్చుండెను. కూర్చుండి కొంతసేపు మాలతి మంకుతనమును గూర్చియుఁ, గొంతసేపన్నగారి యవివేకమునుగూర్చియు మఱి కొంచెముసేపు మకరందుని యెడఁ దనకుఁ గల యనురాగమునుగూర్చియు ముచ్చటించి యంతట రాత్రి రెండుయామములు కాఁగా "నందనునిఁ గాలుసేతులు పట్టి బ్రతిమాలి తోడుకొనివచ్చెద"నని లేవఁబోయెను. అప్పుడు మకరందుఁడు ముసుఁగులో నుండి కదలి లేచి, తన్నుఁ జూచి భయోత్కంపితురాలయిన మదయంతికను జేతితోఁబట్టుకొని యామెను బుద్ధరక్షితవచనము ననుసరించి భార్యగా స్వీకరించి యప్పుడే మాలతీమాధవులున్న యుద్యానమునుగూర్చి ప్రియురాలితోఁగూడ బైలువెడలెను. కాని త్రోవలో నగరరక్షకులు వీని నిరోధింపఁగా వెంటనున్న స్త్రీజనమును, అంతఃపురమునందేమి సమాచారమును తెలిసికొనుటకై మాధవుఁడు పంపఁగా బయలువెడలి సమయమునకు సన్నిహితుఁడైన కలహంసునితోఁ బంపివేసి తానుమాత్రము మసహాయుఁడై నగర రక్షకులతో యుద్ధము చేయుచుండెను.

అక్కడ నుద్యానవనములో మాలతీమాధవు లిరువురును అవలోకితా సహాయులై మదయంతికామకరందుల రాకను బ్రతీక్షించుచున్నారని యీ వఱకే తెలిపియుంటిమిగదా! ఇప్పుడు తత్తఱపాటుతో గలహంసుఁ డాఁడువాండ్రను వెంటబెట్టుకొని వచ్చుచుండుటను దూరమునుండి చూచి మాలతి యపరిమిత సంతోషముతో "నాథా! మదయంతిక లభించినదిసుఁడీ!" యన్న సంతోషవార్తను మాధవునకు మునుముందె నివేదించెను. అప్పుడు మాధవుఁ డామెను గౌఁగిలించి పారితోషికముగాఁ దన మెడనున్న పొగడదండను దిరిగి యామె కంఠమున వైచెను. అంతలోఁ గలహంసుఁడు సస్త్రీకముగాఁ బ్రవేశించి యచ్చటి వృత్తాంతమంతయు జెప్పఁగా విని మాధవుఁడు మిత్రునకుఁ దోడ్పడుదునని యాక్షణమే పరుగుపరుగున శత్రుసేనలో వెళ్ళిపడి తమ్ముఁ బోరవచ్చిన పారక్యబలములనెల్ల మకరంద సమేతుఁడై నఱికి నుఱుమాడెను. అప్పుడు రాజుగారు వారి యసహాయశూరత్వమునకు

మిగుల సంతసించి వారిమీఁద గోప ముడిగి నడచిన వృత్తాంతమంతయు నడిగి తెలిసికొని భూరివసునందనుల రావించి "వీరుగో మీ యల్లుడును, బావమఱఁదియు" నని చెప్పి యొప్పించి కలహము సమాప్తి నొందించెను. అటుపిమ్మట మాధవమకరందులు తమ ప్రియురాండ్రం గలసికొందుమన్న [illegible] తమకముతో నుద్యానమునకు వచ్చి యచ్చట మాలతినిఁ గాని, యందుఁ దమఁ బ్రియసఖిని వెదకుచుండిన లవంగికామదయంతికలవలన నామె మార్గమునుగాని కానక విలపించుచు నామెను బాసి నలువురలోఁ దల యెత్తుకొని తిరుగ నోడి యడవిం బడి పిచ్చివాండ్రవలెఁ దిరుగుచుండి తుదకు బ్రతుకుమీఁది యాసను గోసివేసి చావ నుద్యుక్తులై యుండిరి. ఆ సమయమందు సౌదామిని శ్రీశైలమునుండి మాలతి యిచ్చిన పొగడపూల దండ నానవాలుగొని యచ్చటకు వచ్చి యంగమచ్చమును జూపి యామె క్షేమవార్తను దెలిపి వారిం గాపాడెను.

సౌదామిని వచ్చుటెట్లు? పొగడదండ నిచ్చుటెట్లు? మకరందునకు బాసటయగుమని మాధవుఁ డా ప్రకార ముద్యానమును వెడలిపోఁగానే మాలతి తనచుట్టు నున్న పరివారము నర్మ్యోపనులమీఁద నక్కడక్కడకుఁ బంపివేసి కలహపర్యవసాన మెట్లుండునో యన్న యారాటముచే నేమియుఁ దోఁచక పరధ్యానముతో దగ్గఱనున్న మదయంతికకుఁగూడ నెఱనుయి యొంటిగ నుండెను. అప్పు డఘోరఘంటుని జంపినంతటనుండియు మాధవుని కపకారము చేయవలెనని సమయముకొఱ కెదురుచూచుచుండిన కపాలకుండల, యాకాశమార్గమున రింగున డేగవలె వచ్చి పయిఁబడి మాలతి నువ్వెత్తుగఁ గొని శ్రీశైలమున కేగెను. కాని దాని దుర్వ్యవసాయము కొనసాఁగక మునుపే యం దదృష్టవశమునఁ గాపాలికవ్రతము ధరించుచుండిన సౌదామిని యను కామందకి శిష్యురాలు దాని నదలించి మాలతిని వదలించి యామె యిచ్చిన వకుళమాలికను దెచ్చి పైఁ జెప్పినతీరుగా మాధవమకరందులను శోచనీయమైన బలవన్మరణమునుండి తప్పించి, యా పయిని మాధ

వునిచే మాలతినిఁ దెప్పించి, యా పిమ్మట నందనునిచే లిఖితపూర్వకముగా
మదయంతికా మకరందుల వివాహమున కొప్పించి యిట్లెల్లవారికి నపరిమిత
మైన యానందమును గలిగించెను.

ఈ మాలతీమాధవముయొక్క కథాబీజము బృహత్కథనుండి గై
కొనఁబడెననియు, అదియే యీ తీరుగా విస్తరింపఁబడినదనియుఁ గొన్ని
శృతములం దీనాటకమునే తెనిఁగించిన మ-రా-శ్రీ-దాసు శ్రీరాములుగారు
తమ పీఠికలో వ్రాయించియున్నారు. ఉత్తరరామచరిత్ర రచియించు
టచేఁ గాళిదాసుకంటెను ఎక్కువవాఁడని ఖ్యాతికెక్కిన భవభూతివంటి
మహాకవియొక్క కవితాపటిమనుగాని రచనా వైదగ్ధ్యమునుగాని నాబోటి
యల్పజ్ఞుఁడు విమర్శింపఁ బూనుకొనుట కేవల సాహసకృత్యము. నిశ్చయ
ముగా నాంగీకరింపఁ బూనుకొనుటకంటెను ఎక్కువ సాహసకృత్యము.
అయినను ఈ నాటకమును సవిమర్శముగాఁ జదువువారికి కించిత్ కథాసం
విధానముయొక్క జిగిబిగి మొదటి యెనిమిదంకములవఱకును బహు చమ
త్కారముగాను, అద్భుతావహముగాను వృద్ధినొందినట్లు కనఁబడి తరువాతి
యంకములలోనికిఁ బోవునప్పటికిఁ గొంత సడలినట్టుగాఁ దోఁచకమానదు.
అట్లు తోఁచుటకుఁ గల కారణము; కవి యీ రెండంకములలో మాలతీ
విరహపీడితులయిన మాధవప్రభృతుల యున్మాదావస్థలను [illegible]
ప్రధానముగాను, స్వభావమనోహరముగాను వర్ణింపఁ దలంచుకొన్నవాఁడై
వెనుకఁ గరాళశక్తిగుడిలో నఘోరఘంటుని దొంగతనమును బట్టబైలు
చేయఁజాలిన కామందకియొక్క దివ్యదృష్టి నిప్పుడు ప్రయత్నపూర్వకముగా
మానుఁగుపఱచి "యెందుఁబోతివే! కూఁతురా? యేమి సేయుదునే? తల్లీ!"
యని మాలతినిమిత్తమామె విలపించునట్లు చేసినాఁడు. అట్లుగాక యిప్పుడు
కామందకి మునుపటిచొప్పుననే తన జ్ఞాననేత్రమును విప్పి కపాలకుండల
చేసిన మోసమును చెప్పియుండినయెడల కథాక్రమము మాలతియొక్క
బంధుగులందఱుఁ దత్ప్రతీకారమునకై యుపాయాన్వేషణము సేయుచుఁ

దిరుగులాడుచుండినట్లుగనో యెట్లుగనో మఱియొకవిధముగా మాఱవలసి యుండును. అప్పుడు కథ కొంతపెరుఁగును. ఈ చిక్కునుండి తప్పించుకొనుటకై కవి కామందకికి దివ్యదృష్టినిఁ దొలఁగించినాఁడు. కాని విరోధపరిహారకముగా హేతువును జెప్పి తొలఁగించినచో నది చక్కఁగా నతికి యుండును.

ఇందు ద్వితీయాంకములో నూర్వశీశకుంతలాదుల స్వయంవరవృత్తాంతములు ప్రసంగవశముగాఁ జెప్పఁబడియుండుటచేతను, నవమాంకములో నున్మాదావస్థలోనున్న మాధవుఁడు మాలతికి మేఘునిచే సందేశముఁ బంపినట్లు కల్పింపఁబడియుండుటచేతను ఈకవి తనకుఁ బూర్వికుఁడైన కాళిదాసుయొక్క కావ్యనాటకములయం దెక్కువ గౌరవప్రీతులు కలవాఁడని తోఁచుచున్నది. అందుచేతనే కాబోలు నిం దొకటి రెండుచోట్ల నించుకభేదముతోఁ గాళిదాసు కల్పనలే కానవచ్చుచున్నవి. *

---

* ౧౦ అంకములోని ౮ పద్యము కుమారసంభవము చతుర్థసర్గములోని

శ్లో॥ గతఏవన తేనివర్తతే ససఖాదీపఇవానిలాహతః ।
అహమస్యద శేవపశ్యమామవిషహ్యవ్యసనప్రధూమితాం ॥

౯ అంకములోని ౩౭ పద్యము విక్రమోర్వశీయము నాల్గవయంకములోని

గీ. "కల్లువాసనగల పాలుగాఁబుచుండఁ,
జేతఁదెమలించియందుగుచిగుగొమ్మ
సరసముగఁబోటియందీయఁగరివిభుండు,
మించువేడుకతో నారగించుచుండె."

౧౦ అంకము ౧౮ పద్యము విక్రమోర్వశీయము ప్రథమాంకములోని

గీ. "భీరురాలయసుర - భీతియప్పుడపోయెఁ
ద్రిభువనావనుఁడుగ దేబలారి
తెల్లవాఱదమ్మితీఁగపద్మములట్లు
విప్పమింకనీదు - వెడఁదకనులు."

ఇత్యాదులు సాదృశ్యములు.

అయినను ఇతని కవిత్వమం దితని యుపమలవంటి యుపమలుంగాని ఇతని నాటకములయం దితని విదూషకులవంటి పాత్రములుంగాని కానరావు. మఱియు షేక్స్పియరు మహాకవి నాటకములయందువలె నిందు వచ్చు భూమికలలో గుణస్వభావాదులయందుఁ బరస్పరభేదము లంతవివేషించి కనఁబడవు. కాని హృద్గతములైన భావభేదముల నచ్చునఁ గొడిచినట్లు, వర్ణింపవలసివచ్చినప్పు డితనిం జెప్పి మఱియొక కవినిం జెప్పవలెను. శైలివిచారింతుమేని భవభూతి కవిత్వము మొత్తముమీఁద సమాసప్రాయముగా నుండును. కొన్నిచోట్లఁ బదగుంభన మెక్కువయై యర్థపుష్టి తక్కువయగుచుండును. మఱికొన్నిచోట్లఁ గేవల పాండిత్యప్రకర్షమును బ్రకటింపఁ జాలియుండును. "ప్రియురాలు మును పెట్లో యిప్పుడు నట్లే కనఁబడుచున్నది. కాని యిప్పటిదర్శనము పారమార్థికము గాకపోవు టొక్కటే విశేషము. దృఢతరమైన పూర్వానుభవమువల్ల నాకాపెరూపు గానిపించుచున్నది. ఆ సంస్కారమున కనవరతముగాఁ గలుగు నుద్బోధమువల్ల ధారావాహికన్యాయముగా విస్తరిల్లునదియు, మాలతీస్మృతివిజాతీయములైన జ్ఞానాంతరములచేఁ దిరస్కరింపఁబడనిదియు నగుస్మృతిజ్ఞానప్రవాహము, వృత్తిసారూప్యముచే నా చైతన్యమును దన్మయత్వ మొందునట్లు చేయుచున్నది." (౫ అం ౮౬ పుట) ఈ వాక్యపరంపర వినువారికి విప్రలంభశృంగారముగా నుండునా లేక ప్రబోధచంద్రోదయాదితత్త్వ ప్రతిపాదక ప్రబంధముల కర్తృమయినయుత్తర మీమాంసా శాస్త్రవాదముగా నుండునా యని సంశయము పొడముచున్నది.

మ. రసబాహుళ్యముచేఁ బ్రయోగములు దు ♦ ర్గ్రాహ్యంబులై మీఱు, గా
ఢసుహృద్భావమనోహరంబులగు చే ♦ ష్టల్ గ్రాలెడుం; గామసూ
త్రసమాయోజితమై యెసంగును రసా ♦ దక్ష్యంబు, చిత్రంబులై
పొసఁగుం గాథలు, వాక్యాలం బమితనై ♦ పుణ్యంబునుం గూడెడున్.

అని ప్రస్తావనయందుఁ గవిచే నిర్దిష్టమైనరీతిగా నిందు వచ్చు నాయకుఁడు ధీరశాంతుఁడు; శృంగారము ప్రధానరసము; అంగాంగిభావముగా

భీభత్సాద్భుతరౌద్రాదులయిన రసాంతరములుకూడ నౌచిత్యమునకు భంగము లేకుండ నివేదింపఁబడినవి; కథాసంవిధానము మిగులఁ జిత్రముగా నుండును; లోకములో నవ్యాజస్నేహ మెట్లుండవలయునో చక్కఁగాఁ బ్రదర్శింపబడినది; మఱియు వివాహమునకుఁ బ్రధానాంగమను రాగమే యని విశదీకరింపఁబడినది. నాయికానాయకు లగ్రవర్ణమువా రగుటచేతఁ బూర్వము రజస్వలావివాహములు సేయుసదాచారము బ్రాహ్మణులలోఁగూడఁ బ్రబలియుండెనని తెలియుచున్నది.

నే నీ నాటకమును సాధ్యమయినంతవఱకు మూలానుసారముగానే తెనిఁగించినాఁడను. ప్రస్తావనమాత్రము మూలమునకుఁ గొంచెము భిన్నముగా నుండును. నేను పండితుఁడను గాకపోవుటచేతను, నాకుఁ బండిత సాహాయ్యము లభింపకుండుటచేతను నిందు నా ప్రమాదములును దోషములును విశేషించి యుండవచ్చును. వానినెల్ల దయతో క్షమింపఁ బండితులను బ్రార్థించుచున్నాఁడను. నే నీ మాలతీమాధవమును మొట్టమొదటఁ బండ్రెండు సంవత్సరములక్రిందటఁ దెలిఁగింప నారంభించి మొదటి యంకములోఁ గొంచెము రచించి కొన్ని కారణములచే నప్పుడంతటితో నిలిపివేసితిని. తరువాత నాలుగు సంవత్సరముల క్రిందటఁ దిరిగి యారంభించి నడుమనడుమఁ గలుగుచువచ్చిన యంతరాయములు తొలఁగి యించుక యవకాశము చిక్కినప్పుడెల్లఁ గొంచెము రచించుచుఁ దుదకు దీనిని గతసంవత్సరము 'జూను' నెలలో ముగించితిని. సరసాగ్రగణ్యులగు కొందఱు నా మిత్రులు నా నాటకమును విని యానందించి నా కనేకవిధములఁ బ్రోత్సాహముఁ గలిగించుటచే నిప్పుడు మహాజనుల యాదరణమునుగూడఁ గోరువాఁడనై దీనిని బ్రచురించుచున్నాఁడను.

పదవోలు,
గోదావరీమండలము
1—12—1902.

ఇట్లు,
సుజనవిధేయుఁడు.
జనమంచి వేంకటరామయ్య.

# మాలతీమాధవము

## ప్రథమాంకము

చ. సురనదినీరు చెట్టుఁగఁ ♦ జుట్టినపుఱ్ఱెలవంకనిండఁగం
బ్రగఁచులు మించు తీఁగఁగల ♦ ఫాలవిలోచనకీలికీలతోఁ
బెరయు నవేందురేఖ మఱి ♦ సంపఁగఁగోమల కేతకీశిఖన్
సరులుగ సర్పవల్లులఁ బె ♦ నంగు మహేశు జడల్ శుభంబిడున్. ౧.

లయగ్రాహి

ధమ్మనుచు మఱాలినట ♦ నమ్మునకు వంగఁగడు,
సమ్మదమునందిపుర ♦ జమ్ము మొగయింపన్
నెమ్మి వినివచ్చుగుహు ♦ నెమ్మిఁగని యుండవివ,
రమ్మనను డుంచుకథ ♦ బొమ్ము ఫణిదూరన్
జొమ్మ నికటమ్ములను ♦ దుమ్మెదలు సేయు పెను,
దిమ్ము దెసలంతటను ♦ గ్రమ్ము కొనఫీట్కా
రమ్ములను నిగుడ్చుచును ♦ దుమ్మెడిని నాయకుమొ,
గమ్ము విదలింపులుచి ♦ రమ్ము మిముఁ బ్రోచుఁ గా. ౨.

(* నాంద్యంతమున సూత్రధారుడు ప్రవేశించుచున్నాడు)

---

* మఱి రెండుశ్లోకములు ప్రక్షిప్తములని తెనిఁగింపఁబడలేదు.

సూత్ర:- చాలు నతివిస్తర మెందుకు? (తూర్పుదిక్కు వంకఁ జూచి) ఇదిగో నుదయించుచునే పొదలి లోకముల నెల్లఁ బ్రకాశింపఁ జేయుచున్న యీ బాలభాస్కరు నారాధించెదను. (ప్రణమిల్లి.)

ఉ. ఓజసమస్తతేజముల ♦ కోజగదాత్మక! భాజనంబవ
వ్యాజకృపారతిన్ సిరుల ♦ పారముగాదయ సేయు మెక్కుడన్
సోజగదీశ! నా యఘము ♦ లెల్లను వేగహరించి మంగళా
యోజితమంగళంబుగను ♦ నిమ్ముడి నిమ్ము భృశమ్ము భద్రముల్ 3.

(తెరవంకఁ జూచి) మారిషా! రంగమంగళము లన్నియు లెస్సగా సమకూడినవి. కాళప్రియనాథుని యాత్రాప్రసక్తి * మీఁద నానాదిగంతవాసులగు జనులును వేంచేసియున్నారు. ఏమని యిప్పుడు చప్పుడు సడియు లేక నటులూరకున్నారు? "మీరిప్పుడొక యపూర్వ నాటకప్రయోగముచే మమ్మానందింపఁ జేయవలయును." అని యీ విద్వత్సభవారు నా కాజ్ఞాపించియున్నారు. కాఁబట్టి నిర్దిష్టగుణభూయిష్ఠమగు ప్రబంధ మొకటి ప్రయోగించి వీరిం బూజింతము

నటుడు:- (ప్రవేశించి) బావా! ఆర్యులును, పూజ్యులును, సంపన్నులును నగు భూమిదేవు లుదాహరించెడి యాగుణము లవి యెవ్వి?

సూత్ర:—

మ. రసబాహుళ్యముచేఁ బ్రయోగములందు ♦ ర్గ్రాహంబులై మీఱెడున్
రసికానందకరంబులై తనరెడున్ ♦ వ్యాపారముల్, కామసూ
త్రసమాయోజితమై యెసంగు సురసౌ ♦ ద్ధత్యంబు, చిత్రంబులై
పొసఁగుం గాథలు, వాక్యలందమిలనై ♦ పుణ్యంబునుం గూడెడున్ ౪

నటుడు:- బావా! యే ప్రకరణమందు?

* నాటక మాడునప్పుడు సమయానుసారముగా మార్చుకోవచ్చును.

సూత్ర:-(ఆలోచించి జ్ఞప్తికి వచ్చినట్లు) పూర్వము దక్షిణదేశమునఁ పద్మపురమను నగరమందు యాజ్ఞవల్క్యులును, పఙ్క్తిపావనులును, కాశ్యపసగోత్రులును, అహితాగ్నులును, క్రతుకర్తలును, ధృతవ్రతులును, ఉదుంబరనాములును, బ్రహ్మవేత్తలును నగు కొందఱు బ్రాహ్మణులు వసించుచుందురు.

మ. ఘనశాస్త్రాధ్యయనంబు సేయుదు రెలుం ♦ గంగోరితత్త్వార్థ, మా
ధనముం జేయుదు రగ్నిహోమంబుల్ కడఁకని ♦ స్వాపూర్తము ల్సల్పఁగా
ననఘుల్ దారపరిగ్రహంబును నప ♦ త్యావాప్తికై సేయుదుర్
పానరింపం దపవిద్య సేయుదురు సం ♦ పూర్ణాయువ వ్వైదికుల్. ౫

అట్టి సద్వంశమందుఁబుట్టిన భటగోపాలుని పౌత్రుఁడును, పవిత్రకీర్తియగు నీలకంఠుని పుత్రుడును, శ్రీకంఠ పదలాంఛనుఁడును, పదవాక్యప్రమాణజ్ఞుఁడును అగు భవభూతియను మహాకవిచే విరచింపఁబడిన మాలతీమాధవ మను మహాప్రబంధము ప్రతియొకటి యీనడుమ మాతండ్రిగారి పుస్తక భండారమును దిరుగవైచుచుండఁగా నాకాకస్మికముగా లభించినది. మొదటినుండియు నాకు నాటకములయం దెక్కువ యభిరుచి యగుటచే దానిం దీసి చదివితిని, చదువఁగానే యందలి,

చ. మఱియెవరైనఁ గొందఱవ ♦ మానము నీకృతికిం బొనర్చినా
రటేఁగినవార లేమియున ♦ నిత్యుది గాదల వారిఁగూర్చి, యీ
సరిగ జనించెనేని, యిఁక ♦ జన్మము నొందెడు నేమొయొందఱొ
న్నరుచినొకండు మత్సముఁడ ♦ నంతము లేఁగద దేశకాలముల్. ౬.

అను నీ పద్యాభిప్రాయము నిశ్చయముగా నా ప్రబంధమునకే తగినదిగా నున్నదనియే యెంచఁదొడఁగితిని.

నటుఁడు :—ఏమిప్రాగల్భ్యము! ఈ వైదికబ్రాహ్మణుఁ డిన్ని చదువు లెక్కడ నేర్చియుండెనో!

సూత్ర :—నీకుఁ గలిగిన సంశయ మతనిచేతనే నివారింపఁబడు చున్నది. గురుస్మరణావసరమున నాతఁడు,

తే.గీ. జ్ఞాననిధియని సార్థక ♦ నామధేయుఁ
డైన కేవల భగవంతుఁ ♦ డరయ నెవని
గురుఁడో యట్టిసద్గురోద్ధి ♦ గుణము గూడ
గొప్పగాకున్నె పెద్దల ♦ గుణమహిమను? ౭.

నటుఁడు :—బావా! భవభూతి శుద్ధశ్రోత్రియుఁడని చెప్పియున్నాడు. అందుచేత నతఁడు రచించిన నాటకమంతయు వేదములతోను వేదాంతములతోను నిండియుండునేమో?

సూత్ర :—ఓయి వెఱ్ఱివాఁడా! వినుము.

ఆ. వె. వేదపఠన మేల ♦ వేదాంతసాంఖ్యయో
గములు నేల నాట ♦ కములు? నర్థ
గౌరవంబు వాగు ♦ దారతయును ప్రౌఢి
తగును బాండితీవి ♦ దగ్ధతలకు. ౮

నటుడు:-అట్లయిన మన మా యపూర్వనాటకమును యథోక్తముగా నభినయింతము.

సూత్ర:- 'యథోక్తముగా' నను చున్నావు. ఆ నాటకము సంస్కృతభాషయందున్నదే?

నటుఁడు:-ఉన్ననేమి? మన కది క్రొత్తభాషగాదు గదా!

సూత్ర:-మనకది క్రొత్తభాషగాదు గాని యీ సభవారికి మాత్రమది ప్రాతభాషయే.

నటుఁడు:-మీ యభిప్రాయ మేమి?

సూత్ర:- ఈ సభవారు నవనాగరికులలోఁ జేరినవారగుటచే వారికిప్పటి నూతనాభిప్రాయములనుబట్టి స్వదేశభాషాభివృద్ధియందే యెక్కువ యాదరము. కాఁబట్టి యిట్టి "దేశభాషలలోనెల్లఁ దెలుఁగులెస్స" యని యుండుటచేఁ దెలుఁగుననే యభినయింతము.

నటుఁడు:- ఆలాగే కానిండు.

సూత్ర:- మనకు- రాజమహేంద్రపుర వాస్తవ్యుఁడగు శ్రీజనమంచి వేంకట రామకవి నాతి కఠినమైన మృదుమధురశైలి నా మాలతీమాధవము నే తెలుఁగున వ్రాసి యిచ్చియున్నాడుగదా. దానిని నాటకులందఱుఁ గంఠపాఠము చేయ నే చేసినారు.

నటుఁడు:- అవును మనమిప్పుడా నాటకము నే ప్రదర్శింతము. అయితే ముందు పాత్రములను రప్పించువిషయమున నేమి యాలోచించినారు?

సూత్ర:- ఆలోచనకేమున్నది? కామందకియును వృద్ధబౌద్ధ యోగిని పాత్రము నేను పఠించినదే. తచ్ఛిష్యురాలగు అవలోకితపాత్రమును నీకు నిర్ణయించితినిగదా? ఇంకఁ బ్రకరణనాయకుఁడును మాలతీవల్లభుఁడును నగు మాధవుని వేషము కలహంసమకరందులు ప్రవేశించునప్పుడు సిద్ధముగానే యుండును.

నటుఁడు:-(తనలో) ఓహో! చిక్కువచ్చినదే కానిమ్ము. (ప్రకాశముగా) బావగారితోఁ జెప్పమఱచినాను. మీరట్లు పాత్రనిర్ణయము చేసి వెళ్ళినతోడనే మా యింటి యాబిడ నొప్పులు పడుచుండెనని నా కాకస్మికముగా మాయూరినుండి వర్తమానము రాఁగా నేమియుఁదోఁచక చేతనున్న గ్రంథభాగము చెంతనున్న మాతమ్మునిమీఁదఁ బడవైచి చక్క వెళ్ళితిని. ఇందుకు నన్ను మన్నింపవేఁడుచు, కుశాగ్రబుద్ధియగువాఁడును ఇంతకు ముందే తనపాత్రమును జదివి సిద్ధము చేసికొని యుండునని మనవిచేసికొనుచున్నాను.

సూత్ర:- బాగు బాగు! నేను నీకొప్పగించినది నీవు నీతమ్మునికొప్ప గించితివా? మిత్రమువీఁద సామాజికుల కిపరియింటనో పెండ్లియున్న ట్లున్నది. ఓయి స్వకృత్యమును మఱచినవాఁడా! చూడు! మంత్రిబిడ్డలగు మాలతీమాధవుల పెండ్లినిమిత్తము బౌద్ధయోగిని యెంత యారాట పడుచు న్నదో! చూచి యిఁకనైనను తెలివిఁదెచ్చుకొనుము.

నటుఁడు:- (ఇటునటుచూచి) ఏది బౌద్ధయోగిని? ఏదీ బౌద్ధయోగిని?

సూత్ర:- ఇదిగో శిష్యురాలితోఁగూడ నామెను నీ విప్పుడే చూడఁ గలవు. రమ్ము పోదము.

(అని నిష్క్రమించుచున్నారు.)

ఇది ప్రస్తావన.

ప్రథమరంగము- కామందకి గృహము.

[తరువాత కాషాయవస్త్రములను ధరించి కామందకియు
అవలోకితయుఁ బ్రవేశించుచున్నారు.]

కామందకి:_వత్సా! అవలోకితా!

అవ:_అమ్మా! యేమి సెలవు?

కామందకి:_కళ్యాణవంతులును, భూరివసుదేవ రాతులసంతానమును నగు మాలతీమాధవుల సర్వాభీష్టమైన పాణిగ్రహణ మహోత్సవము జరుగవలసి యున్నది. (ఎడమ కన్నదరుటను సూచించి సహర్షముగా,)

క. నాయంతరంగ మెఱిఁగిన
దోయనఁగ స్ఫురించి మంగ ♦ ళోదర్కంబై
నాయెడమ నేత్రమీయెడఁ
బాయని దాక్షిణ్యమూను ♦ వామంబయ్యున్. ౯.

అవ:_భగవతి కీచిత్తక్షోభ మెంత యెక్కువగా నున్నది! ఆశ్చర్యము! చినిఁగి జీరాడుచున్న పీలికలతో గప్పుకొని లెక్కకొక్క కబళమును భుజించుచుఁ బ్రాణధారణము సేయు భగవతిని సైతమిప్పు డమాత్యభూరివసు విట్టి యాయాస కార్యములందు నియోగించుచున్నాడు. అందు సంసారబంధవిముక్తమగు నాత్మ భగవతిచేతను బ్రవేశపెట్టఁబడుచుండుట మఱియు వింతగా నున్నది.

కామందకి:_బిడ్డా! అట్లుగాదే!

ఉ. నాయెడఁ గల్గుస్నేహమును ♦ నమ్మకమున్ బురికొల్పఁగా జామీ
యాయనఘుండు వేఁడెనొక ♦ యర్థము నావలనన్ గడింపఁగన్
బాయుదు నాదు ప్రాణముల ♦ నాతపసంతయు ధారఁబోయుదుం
జేయుదు మిత్రకార్యమెడ ♦ సేయక ధన్యతఁ గాంచనోయుదు. ౧౦

నీవెఱుఁగవు గాఁబోలును. మాకెప్పుడు విద్యాభ్యాసము కొఱకుఁబర దేశములకుఁ బోయి సహాధ్యయనము సేయుచుండ స్నేహమయ్యెనో యప్పుడే యీ భూరివసుదేవరాతులు సౌదామిని చూచుచుండఁగా చేతఁ జేయి వైచుకొని "మనమవశ్యముగా వియ్యమందవలయును" అని ప్రమాణము చేసికొనిరి. కాఁబట్టి న్యాయశాస్త్రమును జదివించుటకై కొడుకును కుండిన పురమునుండి యీ పద్మావతీపురమునకుఁబంపి విదర్భరాజు మంత్రి శ్రీదేవరాతుఁ డిప్పుడు తెలివైన పనియే చేసినాఁడు.

ఆ. వె. వెనుకఁ జేసియున్న ♦ వియ్యంపుశపథంబు
స్మృతికివచ్చుఁబూర్వ ♦ మిత్రునకును;
మఱియు విశ్వవినుత ♦ మహనీయగుణుఁడైన
కొడుకునందుఁ బ్రీతి ♦ కుదురఁగలదు. ౧౧

అవః_అమాత్యుఁడు మాలతిని మాధవునకుఁ దానుగా నియ్యక పోవుట కేమి కారణము? దొంగపెండ్లికోసరము భగవతి యెందుకు తొందర పెట్టుచున్నాఁడు?

కామందకి:___

చ. నరపతిచేత నాతనికి ♦ నర్మసఖుండగు నందనుండొగిం
బరిణయపద్ధతిం దనకు ♦ మాలతినీ నడిగించుచున్న వాఁ
డరయక మోము ముందరనె ♦ యాతని ప్రార్థన ద్రోచిపుచ్చినన్
ధరణిపుఁడాగ్రహించు, శుభ ♦ దంబగునట్టియుపాయమిద్దియే. ౧౨.

అవః_అమాత్యుఁడు మాధవుని పేరైనను దలపెట్టకుండుట మిగుల వింతగానున్నది. దీనింబట్టి యాదరము లేకపోవుటే స్పష్టమగుచున్నది.

కామందకి:_బిడ్డా! అది యంతయు బాహ్యనటనము సుమీ!

తే. గీ. ఎఱుఁగు నెలఁబ్రాయము వివేక ♦ హీనమగుట
యెఱుఁగు మాలతీమాధవు ♦ లిర్వురుంబ
రస్పరానురాగంబులఁ ♦ బ్రబలియుంట
యెఱిఁగియును వారికి 'అనునై ♦ యెఱుఁగఁడిపుడు. ౧౩

మఱియు

తే. గీ. వత్సలన్యోన్య మనురాగ ♦ బద్ధుల నెడి
మాట లోకప్రసిద్ధంబు ♦ మనకుదాన
సేమమయ్యెడుఁ; జీవుకా ♦ భూమిపతియు
నందనుండును మోసంబు ♦ నొందువారు. ౧౪

చూడు.

చ. ఘనమగు రామణీయకము ♦ గన్పఱచుంబయి వేషభాషలం;
దణఁచు రహస్యముల్ నలుసు ♦ లంతలుత్తనైయు; బూటకంబుపై
జనులనుగూడఁ బల్కుకొని ♦ స్వార్థములన్ ఘటియించు దేనితో
నెనయక కార్యవేదిపయి ♦ కేమియెఱుంగని వానిఁబోలుచున్. ౧౫

అవ:- మీ సెలవు చొప్పున నేనును నెమ్మదిగా నేవియో పనులు కల్పించి మంత్రి భూరివసువుగారి లోఁగిటి ప్రక్క రాజవీధిని మాధవుని ద్రిప్పుచునే యున్నాను.

కామందకి:- అవును. మాకు మాలతి దాదికూతురు లవంగిక చెప్పినది.

చ. కురఁగట రాజవీధిఁజనఁ ♦ గ్రొత్తగరూపముదాల్చి పొల్చిన
మ్మరురతివోలె మాధవుని ♦ మాలతితుంగ గవాక్షపీఠయై
యఱిమఱిజూచిచూచి తమి ♦ యగ్గలమాటను దాళలేకదా
మఱిఁగెడియంగకంబులతి ♦ మాత్రము గావనివాడఁజేసెదున్ ౧౬

అవ:-నిజమే. ఆమీఁద నామెపైఁ బ్రొద్దుజరుగుట కష్టముగా నుండుటచే నోర్కింపక వినోదార్థము మామెచే లిఖింపఁబడిన మాధవునిరూపమును లవంగిక యిప్పుడే మందారిక చేతికిచ్చినది.

కామందకి:-(ఆలోచించి) లవంగిక మంచిపని చేసినది. మాధవానుచరుఁడైన కలహంసుఁడా విహారదాసి మందారిక యందుఁదగిలి యున్నాఁడులే. అందుచేత నాప్రతిచ్ఛందక మీ మార్గమున మెల్లఁగా మాధవుకడకు ముందుకార్యమును దెలిపికొనుచుఁ జేరఁగలదని దానియభిప్రాయము.

అవ:-మాధవునకుఁగూడ మదనమహోత్సవమును జూడ వేడుకపుట్టించి యాతని నీ యుదయమే మదనోద్యానమునకుఁ బంపినాను. అక్కడకు మాలతి రాఁగలదు. పిమ్మట నన్యోన్యదర్శనము కాఁగలదని.

కామందకి:-మేలు! బిడ్డ! మేలు! నీవు నీయనువర్తనముచే నా పూర్వశిష్యురాలగు సౌదామినిని దలఁపించుచున్నావు.

అవ:-అమ్మా! యిప్పుడా సౌదామిని యాశ్చర్యకరమైన మంత్రసిద్ధిప్రభావమును బొంది శ్రీశైలమునఁ గాపాలిక వ్రతమునడుపుచున్నదిసుమీ!

కామందకి:-ఈ సంగతి నీ కెవరు చెప్పినారు?

అవ:-ఈనగరి శ్మశానవాటికయందు కరాళయను చాముండ గలదు.

కామందకి:-అవును. కలదట. ఆదేవత నానావిధములయిన జీవబలులచేతఁ బ్రీతినొందునని సాహసిక ప్రవాదముకూడఁ గలదు. తరువాత,

అవ:-శ్రీశైలమునుండి వచ్చి యిచ్చటి కనతిదూరమున శ్మశానవాటమందు ముండ ధారియగు నఘోరఘంటుఁడను సాధకుఁడొకఁడు వాసము చేయుచుండును. అందులకు మహాప్రభావముగల కపాలకుండలయను నాతని

శిష్యురాలనుదినము సాయంకాలమున వచ్చుచుండును. ఆమెవలన నాకీవార్త.

కామందకి:-సౌదామిని యట్టిమహిమలు గలిగియుండవచ్చును.

అవ:-అవును. మనకిప్పడాసంగతి అవసరములేదు. మాధవునకు సహచరుడును బాలమిత్రుడును నగు మకరందుడు నందనమంత్రిచెల్లెలైన మదయంతికను బెండ్లియాడ గలుగునేని యది మాధవున కిష్టప్రాంతిగముగానుండును.

కామందకి:-ఆ పనికి నా ప్రియసఖి బుద్ధరక్షితను నియోగించినానే!

అవ:-భగవతి లెస్సయినపని చేసినది.

కామందకి:-లెమ్ము. మాధవునిసమాచారము దెలుసుకొని పిదప మాలతినే చూడబోదము. (ఇద్దఱు లేచుచున్నారు.)

కామందకి:-(ఆలోచించి) మాలతియనగా నతిగంభీరస్వభావురాలు. "చేయదగినదెల్ల యోచించి మీరే చేయుడు" ని కృత్యమంతయు మనమీదనే వదలివేయును. కాబట్టి మన మతినిపుణముగా దౌత్యమును నడుపవలయును. సర్వవిధముల,

వ. కలువవిరిన్ శరత్స్నమయ ♦ కౌముదియట్లు సుజాతుగాంతునిన్
లలితచరిత్ర మాలతియ ♦ లర్చెదుగావుత గోడె కానిరో
ర్వ్యలాదవి యాడునోడుగను ♦ గూర్చిగుణంబు లమర్చినట్టియ
న్నలువవిశిష్ట సృష్టినిపు ♦ ణత్వమురంజక మైఫలించుతన్. ౧౭.

ఇది విష్కంభము.

ద్వితీయరంగము - ఉద్యానము.

(తరువాత చిత్రఫలకమును చేతఁబట్టుకొని కలహంసుఁడు ప్రవేశించుచున్నాడు.)

కల:- మన్మథుని గర్వము సర్వము నపహరింపఁజాలిన తనరూపరేఖావిలాసములచే మాలతి నుట్టుకట్టుకొనఁ దెలిసికొన్న మా యజమానుఁడు మాధవు నిప్పుడు నే నెక్కడఁ జూతును? (ఇటునటునడచి) ఆయాసముగా నున్నది. ఇప్పుడీ యుద్యానమందు ముహూర్త మాత్రము విశ్రమించి మకరంద సమేతుని మాధవునిం జూచెదను. (వెనుకకు మరలుచున్నాడు.)

(తరువాత మకరందుడు ప్రవేశించుచున్నాడు.)

మక:- మాధవుఁడు మదనోద్యానమునకు వెళ్ళినాఁడని యవలోకిత చెప్పినది. నేనును అక్కడకే పోయెదను. (ఇటునటునడచిచూచి) ఓహో! వయస్యుఁడీలాగే వచ్చుచున్నాఁడు. (నిరూపించి) ఇతనికి,

చ. గమనము మందమయ్యె, మఱిఁ ♦ గన్నులచూపునుశూన్యమయ్యె, దే
హము బలహీనమయ్యె, నిడు ♦ పయ్యెనుశ్వాసమిదేమి? యీనులో
కములను బచ్చవిల్తునధి ♦ కారముసెల్లు, వయస్సుదావికా
రములుఘటించుఁ దాల్మి మధు ♦ రప్రియభావములన్ నశించెడున్. ౧౪

(తరువాత నట్టి మాధవుఁడు ప్రవేశించుచున్నాడు.)

మాధ:-

చ. ఇది సమయంబు గాదనక, ♦ యెబ్బెతికంబనుకోక, సిగ్గుఁబో
విడలిచి, తాల్మిఁ జంపుకొని ♦ వెట్టిదనంబున నాదు డెందమా
వదనజితేందు బింబను వి ♦ భావన సేయుచు మాటిమాటికిం,
గదలెదు వెన్కకిప్పుడతి ♦ కష్టపుయత్నముమీఁద నెట్టెటో. ౧౫

ఏమియాశ్చర్యము!

చ. నిలుకడగాంచె నామదికి ♦ నిర్వ్యాపారపాటున; నవ్యభావముల్
మలఁగె; సుధాబ్ధిఁదేలెనన ♦ మాంద్యమునుం జనియించె నిర్వృతిన్
వెలసినసుక్షమందపుడు; ♦ వెండియు నిప్పుడు వేఁడి వేఁడి ని
ప్పులఁ గౌఁగిలింపఁబడ్డదన ♦ భూరితరవ్యథ కగ్గమయ్యెదన్.

మక:-(చేరవచ్చి) మిత్రుఁడా! మాధవా! యీలాగీలాగు సూర్యుఁడు నెత్తిమీఁదనున్నట్లుగా నెండగాయుచున్నాఁడు. కాఁబట్టి యీ యుద్యానమున ముహూర్తమాత్రము విశ్రమింతము. (ఇద్దఱునిటునటు నడుచుచున్నారు.)

కల:-(సమీపింపవచ్చుచు) చెలికానితోఁగూడి యీ బాలోద్యానమును మాధవుఁడెట్లుగా నలంకరించుచున్నాఁడు! మదనవేదనచే ఖేదమొందుచున్న మాలతికిఁ గన్నులపండువగు నీతని ప్రతిచ్ఛందకము నిప్పు డీతనికిఁ జూపుదునా? పోనీ యిప్పుడు విశ్రామసౌఖ్య మనుభవింపనిమ్ము. (వెనుకకు మరలుచున్నాఁడు.)

మక:-వికసించిన పుష్పకేసరముల చల్లని పరిమళవాసనలచే నుద్యానమును బరిమళింపఁజేయుచున్న యీ సంపెఁగచెట్టు నీడనే విశ్రమింతము. [ఇద్దఱు నట్లు చేయుచున్నారు.] వయస్యా! మాధవా! కామోద్యానమునందు నాగరికసుందరులచేఁ బ్రవర్తింపబడిన మహోత్సవమును జూచివచ్చిన నీవు నాకన్నులకు వేఱుఁగా దోఁచుచున్నావు. మన్మథబాణములకు గుఱియగుచుండుట లేదుగదా? [నవ్వి] వెలిదామరవలె సుందరమగు నీ ముఖము నేల వంచుకొనియెదవు?

పంచచామరము

తమస్సమావృతంబులైన ♦ తత్క్రాణికోట్లకున్
సమస్తమున్ సృజించినట్టి ♦ స్రష్టకిందుమౌళికిన్

సముం డెవండొ యట్టిచిత్త ♦ జన్మశక్తి సుప్రసి
ద్ధమాంగదయ్యు లజ్జఁబూని ♦ దాచనేల నీకథన్. ౨౧.

మాధ:- వయస్యా! యేలచెప్పను? విను అవలోకిత చెప్పినమీఁద వేడుక పుట్టి కామోద్యానమునకుఁ బోతిని. పోయి యందందుఁ దిరుగాడుటచే మిగుల డస్సినవాఁడనై మనోహరమైన యాయాలయప్రాంగణభూమికిఁ జక్కని యలంకారమగుచుఁ గమ్మని యామోదవ్యాసనల కాసపడి తుమ్మెదగములు సరి దిమ్ముసేయు తుమ్మెదలపిండుచేఁ గలఁగనొందిన మంగళచాలు దన్నలంకరింప నింపుగులుకు నొకలేఁత పొగడచెట్టు పాదుచెంతను గూరుచుంటిని. తరువాత వికసించి కాలవశమునఁ జెట్టునుండి నేలజలజల రాలిన పూలను సంగ్రహించి నేర్పుమీఱ నొకమాలికనుగూర్ప మొదలుపెట్టితిని. తదనంతరము గర్భాలయమునుండి మన్మథుని సంచారిణీభావముగల జగద్విజయ వైజయంతికలాగున వెలువడి చక్కగ సమర్పింబడిన బాలనైపథ్యము తనకన్యకాత్వమును వెల్లడించుచుండ నెవ్వగో కాని యతిగంభీరస్వభావురాలగు నొకచిన్నది తిన్నగ నే నున్నచోటికే పరిజనులతో వచ్చినది.

చ. చెలియది రామణీయకపు ♦ సేవధిపై నధిదేవతాప్రథం
బొలుచునొకో! చక్కఁదన ♦ పుంజిగి తేటల యిక్కయొకో! జా
బిలికళలుగ మృణాళములు ♦ వెన్నెలలో నగు నిర్వికారణం
బు లుపిదస్పృష్టి కింకవిధి ♦ పూవిలుకాఁడె నిజంబు నెచ్చెలీ. ౨౨.

తరువాత పూలుగోయుట యందలి యభిలాషచేఁ బ్రేమాస్పదలగు సఖీజనులు వెంటనుండి ప్రార్థింపగా నా చిన్నది నేనున్న పొగడచెట్టుదగ్గఱకే వచ్చినది. బహుదినములనుండి యే పుణ్యాత్మునియందో వలపు నిలిపి యున్నదని దాని మన్మథవ్యథావికారములచేఁ దెలిసికొంటిని. ఏమంటేని,

చ. ఎలిగి తమ్మిదూఁడువలె ♦ నాతిమొదల్ వసివాడె, నెచ్చెలుల్
లలిఁ బలిమాలుతో నెటులో ♦ లాలనమై నుపచారముల్ గొనున్

దళిత వినూతనద్విగద ♦ దంతమనోజ్ఞ కపోలపాళియుం
గలువల కేలినిర్మలిన ♦ కాంతిరమంబు రచించి యుండెడున్. ౭౩

ఆమె నన్నుఁ జూచినదిమొదలు నా కన్నుల కమృతవర్తికయై యమితమైన యానందమును గల్పించి లోహధాతువును సూదంటురాయియు వలెనే నా హృదయము నాకర్షించినది. ఇన్నందుకు?

చ. సుగుణము దుర్గమంబన్నీ ♦ శోధనసేయక యింతియందాగిం
దగులుకొనె న్మనంబు పరి ♦ తాపభరంబున కగ్గమాటకే;
యగణిత శక్తియుక్తమగు ♦ నంచితపూర్వఫలోదయంబుచే
నగును శుభాశుభంబులవి ♦ ప్రాణులకెల్లను బ్రాయికంబుగన్. ౭౪

మం:—స్నేహము నిమిత్తముల ననుసరించియుండదు ననుట విరుద్ధమువిూ.

చ. కొండొక గూఢహేతువునఁ ♦ గూడుఁబదార్థము లొండొకంటితో
నుండవు బాహ్యహేతువుల ♦ నూనుచుఁగూరుము, లెట్టులున్న మా
ర్తాండుఁడు దోచినంతనెలి ♦ దామర మొగ్గ వికాసమొందెడున్
వెండిశశింగనంగరఁగి ♦ నీరయిపోయెడుఁజంద్రకాంతమున్. ౭౫

తరువాత, తరువాత.

మాధ:-తరువాతి వక్కడ,

చ. కనుబొమలంగదల్చుమను ♦ గాంచినవారును బోలెజాణలా
వనిత సఖీజనంబు "లల ♦ వాఁడెనువిూ యిటనున్నవాఁడ" టం
చనుగతి నన్నుజూచిమతి ♦ యట్టైసుధామధురస్మితంబులిం
పొనరఁగఁ జామకోఁదొడగి ♦ రొండొరులంగడగంటి చూపులన్.

మక:-(తనలో) ఎట్టానవాలు పట్టిరి?

మాధ:- పిమ్మటఁ గంకణావళులు ఘల్లు ఘల్లుమన లయానుసారముగా హస్తపద్మము లప్పళించి చప్పటలు చఱచుచు బెదరిపాఱు రాయంచల తెఱంగున నడుగులిడునప్వు డందంపు గిలుకుటందియల సంగతులు గ్రందుకొని గణగణ మ్రోగు గంటల యొడ్డాణములతో వాసులాడ నా చెలికత్తెలో యొయ్యారములు మీఱ గిలుక్కున మరలి "యేమి భాగ్యమమ్మా! యే యమ్మగారికొరకో అయ్యగా రొక్కరిక్కడనే యున్నారు" అని యాచిన్నదానితోఁ బలుకుచు నావంకఁ దమ చూపుడు వ్రేళ్ళతోఁ జూపించిరి.

మక:- ఇది నిశ్చయముగాఁ బ్రథమానురాగమునకు నిదర్శనము.

కల:- (సమీపింప వచ్చుచు) వీరిప్పుడు మనోహరముగా నొక స్త్రీ కథ చెప్పుకొనుచున్నారు.

మాధ:-

మ. వెలికింబంపుచు ధైర్యసంపద, విజృం ♦ భింపింపుచున్ విభ్రమం
బులు, గాటంబగు స్వాతికంపువికృతిం ♦ బుట్టించుచున్, వాక్కులం
దెలుపన్ రాక, విచిత్రమై పరఁగి, యిం ♦ తింబూనె నయ్యంతలో
పలనాచార్యక మేదియో మదన సం ♦ బంధంబుగా బల్విడిన్. ౨౭

అటుపిమ్మట,

చ. కలయఁగఁ జూచునప్పుడు వి ♦ కాసముదాలిచి, వింతగొల్పుటన్
నిలుకఁడఁ బోల్చి, రాగరస ♦ నిర్భరతం గని, భ్రూవిలాసముల్
గలిగితనర్చి, మూఁతగొని ♦ క్రమ్మఱిసూచిన జంకి వెన్కకున్
మలఁగిచెలంగు చూపులకు ♦ మాటికినన్ గుఱిఁజేసి వెండియున్. ౨౮

ఉ. అల్లనవ్రాలి, సిగ్గుగొని ♦ నట్టులు వెన్కకుఁ దగ్గి, భావమున్
వెల్లడిసేయుచుం, జెలిమి ♦ నించుచు, నిశ్చలతం జెలంగుచున్

మెల్లనఁ దారి, విస్మయము ♦ మీఱఁగ ఱెప్పల విప్పనొంది, గం
డ్లు కటాక్ష వీక్షణములఁ ♦ జేసియు దిక్కులఁజి యున్న సామనం
తెలహారించెఁ, దూంట్లుకొచి ♦ యుంచెను, బిల్చెన, పెల్లగించెనున్.

నేను నా స్నేహాచనము ప్రకటించుచుండిన యా సర్వాంగసుందరి సన్నిధానము కారణముగా లోఁబడినవాఁడనైనను గుట్టు చెడకుండుటకై మొదలుపెట్టిన పొగడదండ నెట్టెట్టో తుదముట్టించితిని. అంతటఁ గంచుకి జనంబులు ఛత్రములుదాల్చి మొత్తములుగట్టి వెంబడింప నా చంద్రవదన యాఁ యేనుఁగు నెక్కి నగరమార్గమలంకరించెను.

చ. చనుచు ననుంగనుంగొనను ♦ సాఁకె కుమార్త్మడ వెట్టునప్పుడా
ననమపవృత్తవృంతసలి ♦ నప్రతి మన్వహి యింపఁ గాఁగడుం
దనరి విశాలలోచన ను ♦ ధా విషదిగ్ధకటాక్షమొండు గ్ర
న్ననఁ బరఁగించె గాటముగ ♦ నాటుచు నాహృదిదుస్సిహాంగకన్. 30

అదిమొదలుకొని,

ఉ. ఇంతని యెన్నరాదు, మఱి ♦ యిట్టిదటంచు వంచింపరాదు, గా
దింతకు నెన్నఁడేనను భ ♦ వించినదైనఁ, జెడన్వివేక మ
త్యంత విమోహదుర్విషము ♦ మాచు వికారమదేదియో యిటుల్
స్వాంతము నెంతయుంజడిమ ♦ కగ్గము చేసి తపింపఁ జేసెడున్ 31

మఱియు,

చ. స్ఫురణము లేద యొట్టెదుటఁ ♦ బొల్చెడి వస్తువునందునుం, గడుం
బరిచితమైనదే స్మృతివి ♦ పర్యయమై యొకలాగుఁదోచెడున్
మఱిమఱిఁ బండువెన్నెలను ♦ మంచుఁగొలంకున ముంచియెత్తినం
దఱుఁగదు తాపమేమియు, మ ♦ నంబుఁ జలించి పరిభ్రమించెడున్.

కల:-(తనలో) ఇతని హృదయమును చూరగొన్నది నిశ్చయముగా మాలతియే కావలయును.

మక:-(తనలో) ఓహో! సుతిమించి రాగమునఁ బడుచున్నది. ఇప్పుడు చెలికాని నేమని మందలింతును?

చ. మదనుఁడు నిన్ను సౌమ్యహృదయ ♦ మన్ననఁజేయక యుండుఁగాక! నిన్
గదియవుగాక కల్మషవి ♦ కారము! లంచితమైత్రి నేఁడికో
గాదవుటెగాని యేమగుఁ బ్రబ ♦ యోజనమిప్పుడు జాగరూకుఁడై
వదలక కాముఁడుండెనవన ♦ పంబయి యూతని మేకి నాతజిన. 33.

(ప్రకాశముగా) వయస్యుఁ డామె యన్వయనామధేయముల నెఱుంగుదువా?

మాధ:-మిత్రుఁడా! వినుము. అట్టాచిన్నది యేనుఁగు గున్నపై నెక్కినప్పుడే గుంపుగూడిన యామె చెలికత్తెలలోనుండి యొక్కవారవనిత వెనుకఁ దగ్గి పూలుగోయు నెపంబునఁ గ్రమక్రమంబుగా నన్ను డాయవచ్చి సిగను బూలదండ సవరించుకొనువంకతో నాకుఁజేతులు మోడ్చి "మహాభాగ! సుశ్లిష్టమయిన గుణమునుగలదగుటచే నీకూర్పు మిగుల రమణీయముగా నున్నది. ఈ మన్మథబాణముల వ్యాపారము చిత్రమై క్రొత్తగా నుండుటచే నిందు మాభర్తృదారికకుఁగూడ వేడుకగా నున్నది. రసికులయినవారి నేర్పెప్పుడును మెప్పొందవలయునే కాని వ్యర్థమై యుండగూడదు. కలకంఠకంఠులకుఁ గంఠాభరణమై శోభఁ బెంపఁదగిన మణిహారము చిలుకకొయ్యను వ్రేలియుండఁ దగునా? కాబట్టి యీ పొగడదండ యామె పొగడదండ యనఁదగియుండును," అని నన్నుఁగూర్చి పలికెను.

మక:-ఓహో! యేమిజాణతనము!

మాధ:-తరువాత నేనడిగినమీఁద నా వారకాంత యాచిన్నది మంత్రి భూరివసువుగారి కొమార్తెయనియు, పేరు మాలతియనియు, తా

నామెకుఁ బ్రేమాస్పదురాలైన లవంగికయను ధాత్రేయి (దాదికూఁతుర) ననియుఁ జెప్పినది.

కల:- (సంతోషముతో) మాలతియేనా? అటులయిన నిదిమాకందఱకుఁ గావలసినదే. భగవంతుఁడైన కామదేవుని సంకల్పముల కదృష్టముగూడఁ దోడుపడుచున్నది.

మక:- (తనలో) అమాత్యభూరివసువుకొమార్తె యగుటచేతనే మిక్కిలి మాననీయురాలని చెప్పుట కామె యసమానములైన యితరగుణములను తక్కువపఱచుటయే. ఇంతేగాక భగవతియైన యా కామందకి "మాలతి! మాలతి" యని చెప్పకొని యెంతసంతోషించుచుండును! ఆమెను నందనున కిచ్చి పెండ్లిచేయవలసినదని రాజడుగుచున్నట్టు కింవదంతియు గలదు. (ప్రకాశముగా) తరువాత,

మాధ:- ఆమె నన్ను బ్రతిమాలిమీఁద చేతనున్న పొగడమాలికను బుచ్చుకొమ్మని యానతిచ్చితిని. గ్రుచ్చునప్పుడు ధ్యానముచేయు మాలతిముఖముమీఁదనే యుండుటచే నడ్డనడ్డముగా రచియింపఁబడ్డ యీ వకుళమాలిక నేనో యొక యపురూపవస్తువని వలెనేచూచి మహాప్రసాదమని పుచ్చుకొని యా వారసుందరి, వేడుక చూచి గుంపులుగూడి మరలిపోయెడి పురజనుల సందడిలో నదృశ్యురాలుకాఁగా నే నిక్కడకు వచ్చితిని.

మక:- వయస్యా! మాధవా! నీవుచెప్పిన వృత్తాంతమును బట్టి యా మాలతి తనవలపెల్ల నీమీఁదనే నిలిపినట్టు స్పష్టమగుచున్నది. ప్రాగనురాగ సూచకముగాఁ గపోలతలము వెల్లఁబాఱుటయు నీ నిమిత్తమే. నిన్నెక్కడ జూచినదో కాని చూచినది. కులశీల గుణగణంబు వేత్తలగు తాదృగ్భాగ్యవతులకుమనస్సొకచోటను దృష్టివేఱొకచోటను దగిలియుండవు. ఇంతేగాక,

ఉ. తొయ్యలి నీపయిన్వలపు ♦ తొత్తెనెనిల్పినదాని చిన్నెలా
నొయ్యనఁదత్సఖీజనము ♦ లొండొరుమోములఁజూచుకొంచొగిన్

"అయ్యయొకండెవండో యొక ♦ యమ్మకుసై యిటనున్నవాఁడ" టం
చయ్యెల నాగనాడుటయు ♦

మాధ:- ఇంకొకటి?

మక:- ♦ అల్లలవంగిక పౌఘలోక్తులంస్. ౩౮.

కల:-(చేరవచ్చి) ఇదియొకటిగూడ [చిత్రపటమును జూపుచు
న్నాడు.]

మాధ:—మక—[చూచుచున్నారు.]

మక:-ఇది మాధవునిరూపమే! యెవరువ్రాసినారు?

కల:-ఎవరు వీనిహృదయమును దొంగిలించినారో.

మక:-మాలతియేనా?

కల:-మరేమి?

మాధ:-చెలికాఁడా! మకరందా! నీవు చేసినయూహ యిప్పుడు సరి
గానే యున్నది.

మక:-నీకిది యెట్లు లభించినది?

కల:-లవంగిక మందారికచేతి కిచ్చినది. మందారిక నాచేతికిచ్చినది.

మక:-మాధవుని రూపమును లిఖించుటయందు మాలతి యుద్దేశ మే
మైయుండినట్టు నీతో మందారిక చెప్పినదో చెప్పుము.

కల:-ఉత్కంఠావినోదనమని.

మక:-మిత్రుడా! యింక నూరటనొందుము.

౯. వెన్నెలమాడ్కిఁజూడ్కికిని ♦ వేడ్కయొనర్చెడు నీకుఁగాంతయుం
బున్నమునేసి పుట్టితివి ♦ ముద్దియకీప్సిత బంధబంధువై
కన్నియతోడి సంగమము ♦ గల్గు టకోసఖ! యింకసంశయం
బున్నదె? యవ్విధిస్మరులె ♦ యొద్దికమైఁ గృషిసేయుచుండఁగా ౩౯.

నిన్నిట్లు మరులుకొలిపి వికారముల పాలుచేసిన శ్యామసుందరాంగి రూప మిందు వ్రాయుము. చూతము.

మాధ:- మిత్రునికోరిక గొంటో యట్లే [కలహంసునితో] కలహంసా! ఉపకరణములను దెమ్ము.

కల:- [ఇచ్చుచున్నాడు.]

మాధ:—(వ్రాయుచు) మిత్రుఁడా! మకరందా!

చ. వెడలెడి బాష్పపూరమది ♦ వీక్షణపంక్తి ననుక్షణంబుఁగ
ప్పెడుఁ, బడఁతిన్ మన్నిలుప ♦ వేగనొడల్ జడిమంబుగొంచు మా
న్పడిరెడు, వ్రాయఁబూనుకొనఁ ♦ బాణియుఁ దోనచెమర్చియుంతయున్
వడఁకెడియంగుళుల్ గలిగి ♦ వర్తిలుచుండె నేఁకేమి సేయుదున్. ౩౭

అయినను పట్టిపట్టి వ్రాయుచున్నాను. (అని యొట్టకేలకు వ్రాసి చూపుచున్నాఁడు.)

మక:—(చిత్రమును బరిశీలించి) బాగున్నది. నీ యనురాగమునకుఁ దగినట్లు లిఖించితివి. (సంతోషముతో) ఇదిగో పద్యమునుగూడ వ్రాసితిని.

“చ. ప్రకృతి మనోహరంబులగు ♦ రాజకళాది సమస్త వస్తువుల్
సుకరగతిన్ మదన్యులను ♦ జొక్కఁగఁజేసినఁ జేయునేమొ? యీ
వికచపయోజ లోచనను ♦ బ్రీతి మెయింగనఁగంటి, జన్మసా
ఫలకముగ నాకదే ఘనత ♦ రంబగు నుత్సవమా జగంబునన్.” ౩౮
(అని చదువుచున్నాఁడు.)

మందా:—(ప్రవేశించి) కలహంసా! కలహంసా! దొంగా! దొంగా! అడుగుజాడనుబట్టి పట్టుకొంటిని. (మాధవ మకరందులనుజూచి సిగ్గుతో) ఆ మహానుభావులుగూడ నిక్కడనే యున్నారు. (సమీపించి) దండము లండి!

ఉభయులు:—మందారికా! పనిమీఁద వచ్చితివి. రమ్ము. కూర్చుండుము.

మందా:—(కూర్చుండి) కలహంసు నడిగి చిత్రఫలకమును దీసికొని పోదమని వచ్చినాను.

కల:—ఇదిగో పుచ్చుకొనుము.

మందా:—ఎవరు ఎందుకొఱకు ఇందు మాలతిని లిఖించినారు?

కల:—మాలతి యెవరికిని ఎందుకొఱకు లిఖించినదో?

మందా:—(సహర్షముగా) అదృష్టవశమున బ్రహ్మదేవుని నేర్పునకు ఫలము తరుణమందే కలుగుచున్నది.

మక:—సఖీ! మందారికా! యీ వస్తువువిషయమున, ఈ నీప్రియుఁడు చెప్పిన దట్టిదేకదా?

మందా:—మహాభాగా! అట్టిదే.

మక:—ఇంకొకటి, మాధవుని మాలతి ముందెక్కడఁ జూచినది?

మందా:—మేడమీఁది కిటికీలోఁ గూరుచుండి చూచినదని లవంగిక చెప్పినది.

మక:—సరే! నే ననుకొన్నట్టే. మేము మంత్రిగారి వీధినిఁ బెక్కుమాఱులు పోవుచుందుములే!

మందా:—మహాభాగ! అనుజ్ఞ యైనయెడల కామదేవునియొక్క యీ విలసితమంతయు నిప్పుడు వెళ్ళి ప్రియసఖియైన లవంగికకుఁ జెప్పుచున్నాను.

మక:—ఇంతకన్న సమయములేదు. పోయి నీవుచెప్పవచ్చును.

మందా:—(చిత్రపటమును బుచ్చుకొని నిష్క్రమించుచున్నది).

మక:—వయస్యా! మధ్యాహ్నము కావచ్చినది. రమ్మింటికే పోదము. (ఇద్దఱును లేచి యిటునటు నడచుచున్నారు.)

మాధ:—ఇప్లను,

చ. సరసిరుహాక్షికుచ్చెలము ♦ సల్పుచుఁగూడ మెలంగురోల్కఁ బుం
డేలపలు నేర్పునిర్మలఁ దము ♦ నిద్ధపుఁజెక్కులఁ గుంకుమంబులో
సూరుపుగ దిద్దికొన్నయాల ♦ ప్రౌఢటిపత్త్ర విచిత్రవైఖరుల్
గరఁగెదునంచు సెంచెదను ♦ గ్రమ్మవెసందిగ జాలుచెమ్మటన్. ౩౮

మఱియు,

ఉ. కుందలతావితానవ ♦ కోమలసూనముల సీమలందుని
ష్యందమకరంద బిందువుల ♦ సాంద్రసుగంధము లందికొన్న యో
మందసమీర! యీవతస ♦ మంజసగాత్రిని నాతిచంచలా
క్షిందగఁ గౌఁగిలించుచును స్పృ ♦ శింపుమి నాయఖిలాంగకంబులన్.

మక:—(తనలో)

తే. గీ. మారుడఁ నివార్యవేసుషమ ♦ మారదేహు
నెట్లు బాధించుచున్నాఁడొ ♦ కృపదొలఁగి;
తొలుత నేత్రదోషవివర్త ♦ కలితమగుచుఁ
గలభమును దీవ్ర *కూటపా ♦ కలముపోలె. ౪౦

కాఁబట్టి మా కిప్పటున భగవతి కామందకియే శరణము.

మాధ:—(తనలో)

తే. గీ. విచ్చు పొందామరసనీడు ♦ వచ్చుముద్దు
మొగము నావంకఁ ద్రిప్పిన ♦ మదవమిన్న
కానఁబడెడు నాకు వివర్త ♦ మానయగుచుఁ
నీవ, లావల, లో, వెలి ♦ నెల్లయెడల. ౪౧

---

* గజజ్వర విశేషము.

తే. గీ. ఏడ నున్నాఁడొ యోసి! నీ యిష్టుఁడిపుడు?
కన్నె పడుచుల మఱగిన • కాముకుండు
బ్రహ్మనిష్ఠులఁ గెడపిన పాపకర్ముఁ
డేడ నున్నాఁడొ పతి యగు • నేని వేగ
వచ్చి కాపాడుకొనుఁగాక • వనిత! నిన్ను
నెఱుఁగవో కాక యిపుడేను • దొరకఁబట్టి
డేగపాటునఁ గలఁగు టి • ట్టిభిని బోలె
మ్రింగి వైచితి నింకేమి • మిడికె దీవు.

దీని నిప్పుడు శ్రీశైలమునకుఁ గొనిపోయి శరీరమును నువ్వుగింజలంత ముక్కలుగాఁ గోసివేసి కుళ్ళిచచ్చునట్లు చేసెదను. [మాలతిని దీసికొని నిష్క్రమించుచున్నది]

మద—నేనును మాలతి వెనుకనే పోయెదను. [ఇటునటు నడచి] చెలీ! మాలతీ!

లవం—[ప్రవేశించి] చెలీ! మదయంతికా! నేను లవంగికను.

మద—చెలీ! మహానుభావుని జూచితివే?

లవం—లేదు. అతఁడీ తోఁటపాలిమేర దాఁటఁగానే కలకలధ్వని విని శౌర్యమువచ్చి వైరివీరుల కెక్కుగొనినట్లు తొడలు చఱచుకొనుచుఁ జెంగునఁ బరువువాఱి యొక్కనిమిషములో శత్రుసేనలలో వెళ్ళిపడెను. అంతట మందభాగ్యురాలనగు నేను "హా! మాధవ! హా! మహాభాగ! హా! మకరంద! హా సాహసిక!" యని గుణానురాగులై యింటింటను పౌరజనులు చేసెడి విలాపముల నాలకించుచు వెనుక మరలితిని. మహారాజును వధూవరుల విప్రలంభవృత్తాంతమును విని యాగ్రహగ్రస్తుఁడై తత్క్షణమే తన కాల్బలము నంతయు యుద్ధరంగమునకుఁ బంపి మేడ మీఁదియంతస్తుపై వెన్నెలబైటను కూరుచుండి చూచుచున్నాఁడఁట.

మద.—అయ్యో! మందభాగ్యురాలను! చచ్చితింగదే!

లవం.—చెలీ! మఱి మాలతి యెక్కడనున్నది?

మద.—అది నీవుపోయిన తెరువువంకఁజూచుచు నప్పుడే బయలు దేఱినది. ఆ వెనుక నేను దానిం జూడలేదు. ఈ యుద్యానగహనము లోనికిఁ బోయియుండ వచ్చును.

లవం.—[గొందరతో నిటునటు దిరుగుచు] చెలీ! జాగు సేయక వెదకుదము. నా ప్రియసఖి పట్టి పిఱికిగుండె. ఇటువంటి సమయములో వన విహారమునకుఁ బోవునని నేఁదలఁపను చెలీ! మాలతీ! చెలీ! మాలతీ! యెం దున్నావు? [అని యిటునటు దిరుగుచున్నారు]

కల.—[సంతోషముతోఁ బ్రవేశించి] అమ్మయ్యా! దేవుని పుణ్యమాయని దెబ్బలు లేకుండఁ దప్పించుకొని బైటఁబడినాను. ఏమి శత్రుసైన్యము! ఎంత భయంకరము! ఇప్పటికిని నా మొగమున వ్రేలుచున్నట్లే యున్నది. ఎడతెఱిపి లేక నెఱపోటుబంట్లు జరీనఁదూసి ఝళిపించిన విచ్చుకత్తుల వాతులు ధళధళమను పండువెన్నెలం దళదళమని మెఱసి యెంత భయంకరముగ నుండెను! చెడఁద్రాగి మత్తుగొని పత్తువకోలఁది నువ్వెత్తుగఁ బట్టిత్రోయు బలరాముని చేతి మేటినాగేటిత్రోపునకుఁ దెరలి తిరుగుడువడి కొట్టుకొని బొబ్బరించు యమునానదీ ప్రవాహమువలె నేమి రణగుణధ్వని! మకరందుఁడు మాఱులేక మలసి చెంగునఁ గుప్పించి కుడియెడమలులేని చెలఁగాటగా సేనలనెల్లఁ జీకాకు పఱుపఁగా నప్పుడు వాండ్రు పట్టుఁడు! కొట్టుఁడు! నఱుకుఁడు! పొడువుఁడు! అని బొబ్బరించుచుఁ జేసిన కోలాహలము దిక్కులఁ బిక్కటిల్లిపోయినది. మఱి మా యజమానుఁడు మాధవుఁడు గారి పరాక్రమమో! వజ్రపంజరమువలె దారుణమైన భుజయుగళము నప్పళించుకొనుచు, బెట్టిదుండయి పయిఁబడి కొట్టు తనదెబ్బలకు నొదలు తూంట్లువడి బొబ్బలిడుచు నేలవ్రాల వైరివీరుల చేతుల కత్తికటారుల వెఱపు

లేక పెటికిపుచ్చుకొని విచ్చలవిడి కాలరుల నటికి నురుమాడి తటిమివైచి యిట్లు పలుతెఱంగుల విక్రమించిమించినిర్వర్తితసర్వారి నిర్మథనవిషమసాహసుండయి స్వైరముగ విహరించినాఁడు. ఓహో! ఆమహారాజుగారి గుణానురాగ మేమని చెప్పవచ్చును? సౌధశిఖరము మీఁదఁ గూర్చుండి చూచుచుఁ బ్రతిహారులు మనవిచేసికొన్న వినయవాక్యములచేఁ గ్రోధము శాంతినొందఁగా బ్రసన్నముఖుఁడయి, యప్పుడే మాధవునిం బిలిపించి యాతని ముఖారవిందముఁ జూచి, సందడిసేయకుఁడని తనచుట్టునున్న వారిని సారెసారెకు వారించుచు, నాతని యూరును పేరును నడిగి తెలిసికొని, యుద్ధ మాలిరుగఁ బరిసమాప్తినొందినందు కిష్టపడనట్లు కోపదృష్టిసోఁ గొలకొలాడుచున్న భూరివసుసంపనులవంకఁ బ్రసాదమేదురముగాఁ జూపు నిగిడించి మధుర గంభీరభాషణములతో “మీరిప్పు డెందుకు విచారించెదరు? త్రిభువనాలంకారులును నవయౌవనసుకాభిరాములును మహానుభావులును నగు నిటువంటి యల్లురను బడయఁగంటిమని యానందమును బొందుఁడు.” అని చెప్పి రాజుగారు లోనికిఁ బోయినారు. వీరుగో! మాధవమకరందులు వచ్చుచున్నారు. నేనుబోయి భగవతి కీవృత్తాంతమును నివేదించెదను. [అని నిష్క్రమించుచున్నాడు.]

లవం—చెలీ! మదయంతికా! ఇది నీకు సంతోషకరమైన వార్త. మాలతికిని అటువంటిదే. రమ్ము. దానిని వెదకుదము. [అని నిష్క్రమించుచున్నారు.]

[తరువాత మాధవమకరందులు ప్రవేశించుచున్నారు.]

మాధ—ఓహో! చెలికానియొక్క ప్రబలమైన సహజవిక్రమమనన్యసామాన్యముగదా!

ఉ. చేతులఁ బట్టి కొట్టి పొడి ♦ సేయఁగఁ గూలెడి యొంపగూండ్లుగా
వే తునుమాడి ముందరిపు ♦ వీరుల, వెన్కఁద దాయుధంబులన్

ఖ్యాతినటించు నీదు సము ♦ దగ్రలలద్ఘనరుండఖండచం
డాతతభండవాంబుధికి ♦ నావల నీవల రాతిగట్లునాఁ
జేఁతలు దక్కి నిల్చి రెస ♦ నేయక శత్రుపదాతివర్గముల్. ౯

వయస్యా! ఇది తలఁచుకొనఁగానే పశ్చాత్తాపము కలుగుచున్నది సుమీ! చూడు.

మ. పొలఁతుల్ పుక్కిటఁగ్రోలి శేషము లిడం ♦ బొండానిసీధోత్సవం
బుః యం దిందుమయూఖఖండనిచితం ♦ పున్సీధువుం గ్రోలి వా
రల కౌఁగిళ్ళ సుఖించుచిప్పుడెయుద ♦ గ్రత్వద్భుజా ఘాతని
ర్దళితాంగాస్థికులౌచు దూఱెద రసా ♦ రంబంచు సంసారము౯. ౧౦

ఈ మహారాజు సౌజన్యము మఱవఁదగ్గదికాదుసుమీ! మనము సాప రాధుల మయ్యును నిరపరాధులనువలెనే యాదరించి మనమీఁద నెంతో ప్రీతిఁ గనఁబఱచినాఁడు. కాఁబట్టి యిప్పుడు మాలతీసమక్షమందు మద యంతికాపహరణ వృత్తాంత మంతయుఁ జెప్పుకొని సంతసింతము. [మునుసు వైపుచూచి] ఏమిది? [illegible] లేనట్లున్నది!

మక — మఱేమి లేదు. మనము యుద్ధమునకుఁ బోతిమని కళవళపడి యేమియుఁ దోఁచక వారిందఱుఁ దిరుగాడుచు నీతోఁటలోనే యెక్కడనో ప్రొద్దు పుచ్చుచుందురు.

మాధ—

చ. పెనఁకువసుద్దు లీవు విని ♦ పింపఁగఁ జిర్నగవూను మాలతీ
కనకనిభాంగి దన్నుఁ గద ♦ గంట నదల్చి కన౯ జుగుప్సనొం
దిన దయి విప్పుకన్బొమల ♦ త్రిప్పుల నొప్పెడి యాననాంబుజం
బును జెలి వంచుకోఁ గలుగుఁ ♦ బో! సఖ! చూపు చలింపకుండఁగ౯.

ఇదే యుద్యాన ప్రదేశము. [ప్రవేశము నభినయించుచున్నారు.]

లవం — మద — చెలీ! మాలతీ! [చప్పున జూచి సంతోషముతో] ఇదిగో మహానుభావులు పూర్ణమనోరథులై వచ్చినారు.

మాధ — మక — చెలులారా! మాలతి యెక్కడ నున్నది?

లవం — మద — మీ కాలిచప్పుడు విని మాలతి యనుకొని యీ మందభాగినులు వంచింపఁ బడినారు.

మాధ - అయ్యో! మీ రిరువురు నా హృదయమును వేయి వ్రక్కలు చేయుచున్నారు. అదియేమో స్పష్టముగాఁ జెప్పఁగదరే!

తే. గీ. చెలియ కెపు డేమి యొగ్గు వా ♦ టిలునో యనుచు
నదలుచుండుదు నెపుడు నా ♦ యంతరాత్మ
నయ్యయో యిప్పు డెశమ కి ♦ న్నదరఁ జొచ్చెఁ
బయిగ మీ పల్కు విని యిఁక ♦ బ్రతుకఁ గలనె? ౧౨

మద - అప్పుడు మీ రట్లు బయలుదేఱి వెళ్ళఁగానే మాలతి యవలోకితాబుద్ధరక్షితలను భగవతియొద్దకుఁ బంపి "అప్రమత్తులరైయుండఁ గోరుచున్నానని యాత్యప్రత్రినితో మనవిచేయవే" యని మీ కడకు లవంగికను బంపినది. పిమ్మట నేమియుఁ దోఁచక, లవంగిక పోయిన తెరువు వంకఁ జూచుటకు వెడలినది. అటుపయిని నేను దానిం జూడలేదు. అంతట మేమిరువురము నిండలి చెట్లతోఁపు లన్నియుఁ గలయ వెదకితిమి. అయితే మీకును గనఁబడలేదు?

మాధ — హా! ప్రియురాలా! మాలతి!

ఉ. ఏదో యమంగళంబు ఘటి ♦ యిల్లెఁగదే! చెలి! కోడిగాల కిం
దాదరువైన వేళయఁటె? ♦ యాదట దర్శన మీయరాదఁటే?
వాదఁటె? లేదఁటే దయల ♦ వంబునుఁ? బల్కక టాడరాదఁటే?
వేదనపాలు సేయుధఁటె? ♦ వెన్కటి శోధన గూడిరాదఁటే? ౧౩

మద - లవం - హా! ప్రియసఖీ! యెందుఁ బోతివే!

మక - చెలికాఁడా? ఏమి యిట్లు వెఱ్ఱిపడి విలవిల లాడెదవు?

మాధ - వయస్యా! మాధవునితోఁ జెలిమి చేసి యది పడ్డ బాముఁ

లను అన్నెల్ల సరిచేసికొని యది నడచిన నడవడియు నప్పుడే మఱచితివా?

మక - ఇది యొక్కటి యున్నది మఱి. భగవతిపాదపీఠమును దర్శింప

వెడలినదేమో! కనుక రమ్ము అక్కడకే పోదము.

మద - లవం - అవును. ఇదియును సంభావ్యమే.

మాధ - సరే. అట్లే కానిండు. [అని నడచుచున్నాఁడు.]

మక - [తనలో]

మ. చెలి కామందకియింటికై వెడలు బే ♦ సిదఁబుగాఁ దోఁచెడుం;

దెలియఁగ రాదటుపైని ప్రాణములతో ♦ దేవీగృహంబుం గనన్

గనదో లేదో నిజంబు; ప్రాయికము గన్ ♦ సౌదామినీస్ఫూర్తినం

చలమౌఁ గాదెసుహృత్ప్రియా ప్తజనతా ♦ సంగాదిసౌఖ్యంబిలన్.

[అందఱు నిష్క్రమించుచున్నారు]

అష్టమాంకము - సంపూర్ణము.

# మాలతీమాధవము

## నవమాంకము

రంగము : బృహద్ద్రోణీపర్వతారణ్యము.

[తరువాత సౌదామిని ప్రవేశించుచున్నది.]

సౌదా:- నేను కామందకీ శిష్యురాలనగు సౌదామినినిగదా! కనుకనే యామెకుఁ బ్రేమభూమియగు మాధవుని నన్వేషించుటకై యిప్పుడు పూజ్యమైన శ్రీశైలమునుండి యీపద్మావతికి వచ్చితిని. ఇక్కడ, మాధవుఁడు మాలతి నెడఁబాసినవాఁడై పరిచితప్రదేశములం దిరుగ నోడి యిల్లువిడిచి సుహృద్గర్వముతోఁ గూడి బృహద్ద్రోణీపర్వతారణ్యమందుఁ బ్రవేశించినాఁడఁట. నేనును అక్కడకే బోయెదను. ఆహా! నే నిప్పుడాకాశమార్గమున నెగిరి వచ్చుచుండఁగాఁ గుప్పవోసినట్లు కొండలు కోన లేళ్ళు కోళ్ళు పల్లెలు పట్టణములు కన్నులఁ గప్పివేసినవి. [వెనుకవైపుచూచి] ఆహా!

శా. మేడల్ మిద్దెలు గుళ్లు గోపురములున్ ♦ మిన్నెత్తులై నిక్కురా
పాదుల్ బీఁటలువాఱి కూలి పడిన ♦ ట్లయ్యభ్రమేపారెడున్
జోడై నీటగు తేటనీటిపసమైఁ ♦ జూపట్టె పద్మావతిన్
గూడంబాఱెడి సింధుపాలర పయిం ♦ దోతెంచి బింబక్రియన్.

మఱియు,

మత్తకోకిల. చూఁడియావులు లేఁతపచ్చి ♦ జొంపముల్ దరిదాపు లౌ
బీడులం దిరుగాడి తొల్కరి ♦ వేళ నాదట మేయఁగా
వేడుకల్గని కాపు లెల్లరుఁ ♦ బేర్మి దేని నుతింతురో
చూడనా లవణానదీమణి ♦ చుట్టివచ్చు కరుళ్ళలో.

[మతియొకవైపు చూచి] అదిగో! భగవతి సింధునది. పర్వతశిఖరమునుండి క్రింది భూమియందరి బ్రద్దలగునట్లు ధారాపాతముగాఁ బడుచున్నది.

ఉ. ఈరొదపేర్మి యోరవుర! ♦ యేమనవచ్చు? నవాంబుగర్భగం
భీరఘనాఘనస్తనిత ♦ భీషణమై, సవిధావనీధరో
దారలతావితానముల ♦ యందు సముందగతిం జెలంగుచున్
వారణవక్త్రభూరిగళ ♦ నాదముతో సరిసేయ నయ్యెడున్. ౩

ఇవిగో చందనాశ్వకర్ణసరళపాటలాది వృక్షములచే దట్టములయి, మారెడుపండుల పరిమళంబుల వెదఁజల్లుచు నీయరణ్యగిరిభూములు, ఓహో! తరుణకదంబజంబూవనంబులం నిబిడంబుగ నలమికొన నిరులుగవియు గురుతరగిరినికుంజపుంజంబుల, గుంజద్గంభీరగద్గదోద్గారఘోర ఘోషణంబుగఁ జెలఁగి పాఱు గోదావరి రవంబులకు మాఱుపలుకు నితంబదేశములతోడి దక్షిణదేశ పర్వతారణ్యములం దలఁపించుచున్నవి. ఇందే యీమధుమతీ సింధుసంగమును బావనముసేయుచు భగవంతుఁడైన భవానీపతి స్వయముగ వెలసి సువర్ణబిందుఁడన వెలుఁగొందుచున్న వాఁడు. [ప్రణమిల్లి]

క. జయదేవ! భువనభావన!
జయభగవ! న్నఖిల వరద! ♦ జయనిగమనిధీ!
జయరుచిర చంద్రశేఖర!
జయమదనాంతక! వృషధ్వ ♦ జ! జయాదిగురో!

[నడచుట నభినయించి]

కవిరాజ.

తోలుకరిమబ్బుల నిల్కడ నల్లఁగ ♦ దోఁచెడిరొత్తగునెత్తములం
జెలఁగి ముదంబున నాఁడునెమళ్లొగిఁ ♦ జేసెడి కేయనునాదములం
బులుఁగులుగట్టిన చిత్రపుగూఁడుల ♦ భూజములన్ననుపై నరయొడల్
గలిగి యిదే బృహదశ్మమహీధ్రము ♦ కన్నులపండువుసేసెడుగా. ౪

ఉ. ఇందలి లోయలందు వని ♦ యించెడి కోడెయెలుంగు బంట్లొగిం
క్రందుగ నోటికుంపురులు ♦ గ్రక్కెడు మాటికిఁ దుప్పరుప్పనన్
మందటఁ జెంపుకొందెసును ♦ మత్తగజప్రవిభిన్నసల్లకీ
గ్రంధులఁ గాఱు క్షీరకణ ♦ రిన్నట తిక్తకషాయగంధముల్.

[పయికిఁజూచి] ఓహో! మధ్యాహ్నమైనదే! ఇప్పుడు.

సీ. విడిచి ప్రోషయినను ♦ మ్యాకుమ్రాను దట్టెంపఁ
జిగురాకు కొంపముల్ ♦ చెంబుపుష్పాలు
ఓలచెట్టునకుఁ బా ♦ కెనుగ్రుడ్లకొక్కె
పూర్ణికల్ తటభూమిఁ ♦ బొలుచునూనె
యగిసె ప్రాంకులప్రాలి ♦ యక్కె యగ్రములంటి
దగగొన్న వసుటచే ♦ మగిడినీటి
కందువల్ నెమకంగఁ ♦ గడఁగి పాఱెడు నెమ్మి
తోట్టుమలుంగుల ♦ దూరికాల

తే. గీ. కంటకములుండెఁ; గ్రిందను ♦ గంపపులుగు
లంగలార్చెడు గోండ్రుగోం ♦ డ్రనుచుఁ జెంతఁ
బూవుఁ బొదరింటి గూఁడులఁ ♦ బావురమ్మ
లదరఁజేసెడి హుంకార ♦ మనుసరించి. ౭

సరే. ఇప్పుడు మాధవమకరందులను వెదకి వచ్చిన కార్యమును జూచు కొనియెదను. [అని నిష్క్రమించుచున్నది]

[విష్కంభము]

—O—

[తరువాత మాధవమకరందులు ప్రవేశించుచున్నారు.]

మక - [సకరుణముగా నిట్టూర్పు పుచ్చి]

ఉ. చూపిన యాసపైఁదగులు ♦ సూపకయున్ విడనాడలేకయుం
ద్రోపడి మోహపుం దమము ♦ లోఁదిరుగాడుచు నుండుడెందమే
యాపదచేత, నంకుఁ బను ♦ లట్టులు సేయున దేమిలేకయో
ప్రాపటియుంటి మిందఱను ♦ వక్రపుదైవము చెయ్యిచక్కటా. ౮

మాధ:-హా! ప్రియ్యురాలా! మాలతీ! యెందుఁ బోతివే? అడపాడ
గానరాక యట్టె మాయమైతివే! ఓ నిష్కరుణురాలా! నన్ను దయఁజూచి
సంభావింపఁగదె!

చ. ప్రియునిఁగ మాధవున్ వలపఁ ♦ జేరమి నేలినదానవేల నా
పయిదయలేదు నీకు? విను ♦ వాఁడని నేటొకఁ డున్నవాఁడకో?
స్వయముగ, మూర్తిమంతిమగు ♦ పండుగువోలెను రమ్యకంకణో
దయము భవచ్ఛ్రయంబొసగి ♦ హర్షముసేసిన నాకునన్యుఁడై. ౯

వయస్యా! మకరంద! లోకములో నంతటి యనురాగము కుసుమట
దుర్లభముసుమీ!

చ. వెలఁది యనుక్షణంబు నతి ♦ భీకరమై మదన జ్వరంబు బె
ట్టలమటఁబెట్టఁ బుష్ప మృదు ♦ లావయవంబులతో సహించెగా
తలఁగఁగ నెంచెగాచెలి ప ♦ దంపడి ప్రాణములం దృణంబుగాఁ
బలుకులు వేయు నేల? తెగు ♦ వం దనుదానె ననున్ వరించెగా. ౧౦

మఱియు, చెలికాఁడా! నీకు జ్ఞాపకము లేదా?

శా. నాయాసల్ విడనాడి నందనుని పెం ♦ డ్లాడూటకున్ ముందుగా
నాయంబుల్ దెగినట్టులేపఱియొడ్డల్ ♦ స్వాధీనముం దప్పఁగా
నాయాసంబున నేడ్చుచుం బయికి నె ♦ య్యంబెట్లు తాఁజూపెనో
యాయింతింగని చింతపొంగి పొరలన్ ♦ హా! యేను నెట్లుంటినో. ౧౧

[ఆవేగముతో] అయ్యయ్యో!

*ఉ. ప్రిదులం జేకాని యూరటము ♦ పెల్లున డెందము రెండుగాదు; మైఁ
బొదవుఁజేకాని మబ్బుచెడి ♦ పోవద తెల్వియొకింతయేని, లోఁ
బొదలి దహించుఁగాని తను ♦ వున్ మసిఁజేయదు తాప; మాయముల్
గుదగొని కొట్టుఁగాని తెగఁ ♦ గోయఁడు జీవము దైవమేమనన్. ౧౩

మక:- దైవమువలెనే సూర్యుఁడుగూడఁ దీవ్రత వహించి దహించి చేయుచున్నాఁడు. నీ శరీరావస్థ యిట్లున్నది. కాఁబట్టి యించుకసేపీతామరకొలనిదాపునఁ గూర్చుందము. ఇందు

మ. తెలికిం దోఁచు మృణాళదండములపై ♦ విప్పారు శ్రోత్రమ్ము పూ
వుల పూఁదేనియ సోనలం బొదలుతా ♦ వుల్ గ్రోలియంతన్ విని
ర్మలకల్లోల విలోలశీకరతుషా ♦ రప్రాప్తిచే మెల్లనై
పొలయుం జల్లనిగాలి తెప్పిరలుచుం ♦ బోల్పొంద నీప్రాణముల్. ౧౪

[ఇటునటునడచి కూర్చున్నారు.]

మక:-[తనలో] కానీ యిప్పుడు వీనిమనస్సు మరలించెదను. [ప్రకాశముగా] వయస్యా! మాధవా!

మ. కనులం గ్రమ్మతి నీరు గ్రమ్మకయ మున్ ♦ గాంచందగున్ నీకు నిం
దనయంబున్ సిరి కాటపట్టులగు నీ ♦ యబ్జాకరోద్దేశముల్
ఘనహర్షస్వన మల్లికాక్షచలప ♦ క్షవ్యాహతిందూలి ని
గ్గనయుంబోల్చు మృణాళదండములతో ♦ నీపుండరీకావళిన్.

---

* ద్విపద.

ప్రిదులం జేకానియు ♦ ద్వేగంబుగలుగ। హృదయంబువిడిపోదు ♦ రెండువ్రక్కలుగ
వికలమైదేహంబు ♦ పెనుమూర్ఛఁదగులు। సకియఁగూర్చిన తెల్వి ♦ సావకేమిగులు
వొదవెల్లఁగాల్చులో ♦ నుడుకుప్పతిల్లి। మడిసిపోదేమి భ ♦ స్మంబుగాఁజెల్లి
యూయమముల్ దగఁగొట్టు ♦ నారజీవంబుఁ। గోయఁడేయేమను ♦ కొందు దైవంబు.

పాఠాంతరము.

మాధ:-[ఆరాటముతో లేచుచున్నాఁడు.]

మక:-ఏమి యిది? నాగోడవ వినిపించుకొనకయే యెక్కడకో లేచి పోవుచున్నాఁడు! (నిట్టూర్పుపుచ్చి లేచి) మిత్రుఁడా! నామాట విని నిలువుము. చూడు.

మ. నదిపైఁ బ్రబ్బలి పూలురాలి జలమున్ ♦ వాసింపఁగాఁ జేసెడుం;
బొదలుం బూఁబొదలందు గట్టులపయిన్ ♦ మొల్లల్ ప్రఫుల్లంబులై;
యిద యుత్ఫుల్లకదంబహాసి గురుభూ ♦ భృత్సీమలన్ నెమ్మి న
మ్మద మొప్పన్ నటియింప సానువులపై ♦ మబ్బుల్వితానంబులౌ.

మఱియు,

ఉ. శైలసమీపభూములను ♦ జల్లనబూచెఁ గదంబముల్, దిశల్
చాల మొయిళ్ళ చాలులను ♦ శ్యామములయ్యె, నెసంగెఁ బల్లపు
న్నేలలఁ గ్రొత్తమొల్కలును ♦ నీటగు గేదఁగి పూవులున్, వనీ
పాళి శిలీంధ్రలోధ్ర సుమ ♦ వాసనలన్ వికసించి మించెడున్. ౧౨

మాధ:-వయస్యా! చూచుచునే యున్నాఁడనోయి. ఈ యరణ్యగిరి భూముల రామణీయకము చూడ శక్యముగాకున్నది. ఇది యేమిటి? [కన్నీళ్లతో] తెలిసినది.

ఉ. పూచిన మద్దివేగిసలఁ బొల్చెడితావులుం దాల్చి తూర్పుగన్
వీచెడి యూరుగాలికద ♦ నిద్దపు నీలపుఁ దున్కలట్లుగాఁ
దోఁచు మొగుళ్ళు నల్గడలఁ ♦ దూలెడుఁ; గ్రొంజడివాన యుర్విపై
లేచెడుఁ గమ్మతావు; లొగి ♦ లేచెడుఁ జెమ్మట లద్దె చల్లనై
వేచెదు? వెండివచ్చినవి ♦ వెన్కటిప్రొద్దులె యిప్పుడక్కటా. ౧౩

హా! ప్రియురాలా! మాలతీ!

కవి. పరువపుఁ జీఁకటిప్రాఁకులపోలికఁ ♦ బైపయి నల్లనిమబ్బులున్
బొరిఁబొరిఁ జల్లనిగాలికిఁ దూలెడు ♦ నూతనవారి కణంబులుం, పం

బిగువునఁ [illegible] నటించు నెమ్మి వి ♦ వాదకుల ప్రతివాదములకు
సురవర కార్ముకదీప్తులు నొప్పఁగఁ ♦ [illegible]వఁగ నావళి మూనవిలసత్.

[నిట్టూర్పు పుచ్చి శోకార్తి నభినయించుచున్నాఁడు.]

మక:- ఇప్పుడు చెలికాఁడేదో యతిదారుణమైన యవస్థలోనున్నాఁడు. (కన్నీళ్ళతో) అయ్యో! యెంతకఠినాత్ముఁడను! కనిపెట్టలేక వినోదము మొదలుపెట్టితిని. (నిట్టూర్పుపుచ్చి) నేఁడిప్పుడు మాధవుని విషయమున మా యాసలన్నియు సరిచేసికోవచ్చును. (భయముతోఁ జూచి) స్పృహ దప్పినది! హా! సఖీ! మాలతీ! యింకేమున్నదే? అయ్యో! జాలిలేనిదానా!

ఆ. వె. తల్లి యెఱుఁగకుండఁ ♦ దండ్రి యెఱుఁగకుండఁ
దెగువ సేసినాఁడు ♦ మఱిడి నేఁడు
నిరపరాధియైన ♦ నీ వల్లభుని మీఁద
జాలిమాలితుండె ♦ దేల చెలియ! ౧౯

ఏమిది? యిప్పటికిని ఊపిరి పుచ్చుకున్నాఁడు! అన్నా! మోసము చేసినాఁడు!

శా. ప్రయ్యెన్ డెందము, కీలుప ల్లెడలెడుం ♦ బాహ్యైజగంబాపదుల్
ఒయ్యన్ లోనదహించి మోహమును దా ♦ నుద్దామమై కప్పు; సా
హాయ్యాపేక్షఁ గ్రుశించు నాత్మయును గా ♦ ధాంధంబులో మున్గెనా
వయ్యయ్యో! యిపుడేమి సేయఁదగుఁ గ ♦ ట్టా! మందభాగ్యుండనే.

ఎంతకష్ట మెంతకష్టము!

ఆ. వె. ఎవఁడు బంధుజనుల ♦ కెల్ల వెన్నెలపండు;
వెవఁడు మాలతీ కనుఁ ♦ గవకు ముద్దుఁ
జందురుం, డల మక ♦ రందమిత్రుఁడు జీవ
వర్గ తిలకమకట ♦ ప్రళయమొందె. ౨౦

హా! చెలికాఁడా! మాధవా!

తే. గీ. నాదు మేని గంధపుఁ బూఁత ♦ నాదు కనుల
చందమామ నాదు హృదయా ♦ నంద మెవ్వఁ
డాసొగసుకాని నిన్నుఁ నా ♦ ప్రాణమట్లు
కాలమున నీడ్చ్య కాలుచేఁ ♦ గూలితిఁగద. ౨౨

[స్పృశించుచు]

ఆ. వె. కలికవయ్య చిన్ని ♦ మొలకనవ్వేలయ! నన్
గన్నుకింతవిచ్చి ♦ కనఁగదయ్య!
యిట్టి యాగభావ ♦ మేలయ్య? మేలయ్య
పరమమిత్రు మఱవఁ ♦ బ్రాణసఖుఁడ! ౨౩

మాధ:- (తెలవినొందుచున్నాఁడు.)

మక:- (ఊరుపుపుచ్చి) ఇదిగో క్రొత్తగాఁ బుఱుగడిగిన రాజ పట్టుపగిది నిగనిగమని సొగసుమీఱు తొలిమొగులువలని శీకరాసారముచేఁ బ్రియవయస్యుఁడు తెప్పిఱిల్లుచున్నాఁడు. అమ్మయ్యా! కొంచెమూపిరి పుచ్చుచున్నాఁడు!

మాధ:- ఇప్పుడీ యరణ్యమందుఁ బ్రియురాలి కెవ్వరిచేత వార్తఁ బంపుదును? (చూచి) మేలు! మేలు!

మ. కమియం బండిన పండ్ల నల్లనగుచుం ♦ గన్పట్టు జంబూనికుం
జములం దొఱ్ఱలి సన్నగిల్లు నలరన్ ♦ జాల్వాఱు నేటావలన్
సుమహోత్తుంగ మహీధ్రశృంగగతమై ♦ నూత్నాంబుదం బొండిదే
యమరుం బ్రాఁకతిమాలవాల్యరమణీ ♦ యస్వచ్ఛనీలచ్ఛవిన్. ౨౪

(తొందరగా లేచి యున్ముఖుఁడై దోసిలిపట్టి)

మ. నినువిద్యుల్లలతాంగి పాయకెపుడున్ ♦ ప్రేమంబుమైఁ గౌఁగిలిం
చునుగా? నిన్నుభజించుగా సుముఖతన్ ♦ శోభిల్లి సారంగముల్?

వినుఁగొంపోయెదఁగా సుఖంబుగను వి ♦ న్వీధిం బుణ్యోవాయువుల్
ఘన లక్ష్మీయుతదేవతాధిపధనుః ♦ ఖండాంక! సౌమ్యాగ్రణీ! ౭౫

(ఆలకించి) మేలు! గిరిగహ్వరంబుల నాలకింపనైన ప్రతిధ్వనులతో సంతోషంబునఁ గంఠంబులెత్తి నీలకంఠంబులు సేయు కలకేకారవంబులతో ననుబంధింపఁజేసి యీ ఘనుండు తన మంద్రహుంకారంబుచే నాకనుజ్ఞ యిచ్చుచున్నాఁడు. కాఁబట్టి యిప్పుడు ప్రార్థించెదను. భగవంతుఁడవైన జీమూతనాథా!

శా. ఎందే మత్ప్రతి మాలతిన్ జగతిఁ గం ♦ టేనిన్ యదృచ్ఛాగతిన్
ముందూరార్చిచివెన్క మాధవుని బా ♦ ముల్ దెల్పవే యయ్యా! నా
చందంబున్ వినిపించవద్దు తగదా ♦ శాతంతువుంద్రెంచివే
యం; దానంజూమి యొట్టెటో నిలిచెన ♦ య్యబ్జాక్షికిం బ్రాణముల్. ౭౬

(సంతోషముతో) ఉఁ ఊ! బయలుదేఱినాఁడు! కనుక మఱొక్కెడకుంబోయి విచారించెదను. (అని నడచుచున్నాఁడు.)

మక:- (ఆరాటముతో) ఇప్పుడు మాధవ పూర్ణచంద్రుని నువ్వా దోపరాగ మెట్లుగాఁ గ్రమ్మినది! హా! తల్లీ! హా! తండ్రీ! హా! భగవతీ! మాధవుని యవస్థను జూడవమ్మా! నన్ను రక్షింపవమ్మా?

మాధ:- అన్నా! యెంత ప్రమాదము!

గీ. లావణ్యము లొద్దుగ గ్రాం
బూవులు, చూపులఁ గురంగ ♦ ములఁ 'నడలఁగరుల్',
తీవలు మెయిసొబగునుగా
నీవిధమున గ్రమ్మిఁగిచ్చె ♦ నీయడవి చెలిన్. ౭౭

హా! ప్రియురాలా! మాలతీ!

మక: —

ఉ. ప్రాణసమానుఁడై సుహృదుఁ ♦ డై ప్రియుఁడై సహపాంసుకేళికా
మానినిబద్ధసఖ్యుఁడయి ♦ యొప్పెడి యీనుగుణుండరో యిటుల్

వానను బాసి గానిలి న ♦ లంగి కలంగి మహార్తి ఖేదమం
బూనఁగ రెండు వ్రక్కలయి ♦ పోవిదిరొట్టులు నీవు డెందమా. ౨౮

మాధ: — బ్రహ్మదేవునియొక్క సృష్టినైపుణ్యము పెక్కుచోట్ల నొక్కరీతిగానే యుండును. సరే యిప్పుడిట్లు కానిమ్ము. (మోకరిలఁబడి పెద్దగొంతుతో) ఓహో! పర్వతారణ్యవాసులైన మృగములారా! నేను మనవిచేసికొనుచున్నాఁడను. మీ రించుకసేపు చెవియిచ్చి విని నన్ననుగ్రహింపవలెను.

శా. కన్నారే! సకలాంగసుందరి నిటం ♦ గాంతారదేశంబునన్
విన్నారే! సతికేమి సంఘటిలెనో? ♦ విన్నాణిరొయి ముగ్ధఁదై
యున్నారీమణి డెందమందొదలఁ బు ♦ ష్పాస్త్రుండు రాగిల్లనో
యన్నల్! ప్రాయపుఁ జిన్నెలివ్వివిముఁడీ ♦ యబ్జాక్షి గుర్తింపఁగన్. ౨౯

అయ్యో! యెంతపాపము!

చ. వెసఁబురివిచ్చి కేరుచును ♦ వీనులఁ బెట్టదు నెమ్మి నామొఱన్
గొసరుచుఁ జేరదుం జిలుఁ క ♦ కోరము దామదఘూర్ణితాగమై
కుసుమరజంబు పూసెదును ♦ గోమలిచెక్కటఁ గొండ్రముచ్చయో
యసమయ మయ్యెనిన్నిటికి ♦ నక్కట యెవ్వరి నింక వేడుదున్. ౩౦

ఇక్కడ నింకొకటి,

ఉ. వాతెర కెంజిగి దొరసి ♦ పల్వరుసల్ దగ, గోచనీనుమ
వ్రాతమువోలెఁ జెక్కుఁగవ ♦ రక్తిమనూపఁగఁ, బండిరొయ్యనై
మూతి పడల్చుదాడిమము ♦ పోల్కి వహించు సఖీముఖంబుఁ దా
నీకటెఁ బందుకోఁతి పయి ♦ కత్తి పొరింబొరి ముద్దులాడెడున్. ౩౧

ఇదిగో నీవైపున మఱ్ఱిచెట్టు మొదలను మదపుటేనుఁగొకటి కంఠమానుకొని నిలిచి యున్నది. ఇక్కడను అసమయము గానే యున్నది.

చ. దురదఁ గన్నుమూసికొను ♦ తొయ్యలిఁ గోకుచు దంతకోటిచే
వరుసఁ గదల్చి వీనలకు ♦ బాటిగఁ జల్లనిగాలి వీచుచుం,
గొఱికి నగంబులందుగుచి ♦ గుళ్ళను నోరికి నందియిచ్చుచుం
బరిచయ మిట్లుసేసికొనఁ ♦ బాటుపడున్ వనహస్తి క్రొత్తగన్. 3౨

(మఱియొక వైపుచూచి) ఇంకనిదియో,

చ. ఉఱుము మొయిళ్ళ మాఱుకొని ♦ యుగ్మదు మంద్రఘోరఘీంకృతిన్,
సరసఁ గొలంకునుండి మృదు ♦ శైవలముం జెఱలించి మిగ్రింక, దే
పఱుటమదంబు, నోళ్ళుడఁగి ♦ నట్టియ ఘొల్లలవాల్మ్రగంబుతోఁ
గరి కరిణీవియోగమునఁ ♦ గ్రాఁగి తపించెను విహ్వలించుచున్. 33

కాఁబట్టి యాయాసపడుచున్నదానిని మఱింత యాయాసపెట్టుట గాని దీనినడిగిన ప్రయోజనము లేదు. (ఆనందముతో) ఇక్కడనే మఱియొక్క మత్తమాతంగ యూథనాథుఁడు తన మధుర గంభీర కంఠగర్జిత ధ్వనులచే వేడుకసేయుచుఁ బ్రియురాలితోఁ గూడిమాడి జలక్రీడలాడుచున్నవాఁడు. ఓహో! క్రొత్తగ వికసించిన కడిమిపూవుల తావులకుం దావలంబయి చల్లగ గండస్థలంబులనుండి సంతతధారగఁ బ్రవహించు మదోదకంబుచే గట్టులెల్ల నడుసుగట్ట, తొండమునఁబట్టి పెకలించి వైచిన పద్మషండములతూఁడులు, కాడలు, కేసరంబులు, కింజల్కములు, వలుగడలఁ దూలుచుండ, నెడతెగక తపతపఁగొట్టుకొను తోరంపు వీనుల తాఁకులకుఁ జెదరి చిదురుపలగు తరఁగలచాలువలన బడిబడిఁ బయికిలేచు తుంపురుల గుంపులకు నిలువలేక కురరసారసంబులు వెరచి పఱచుచుండ నీతని జలకేళి చాల రమణీయముగానున్నది. కానిమ్ము. ఇతనిం బలుకరించెదను. మహాభాగ! నాగవల్లభా! నీయావనము కొనియాడఁ దగినదికదా! ఊఁహూ! ప్రియురాలి యనుగ్రహము సంపాదించుకొనుటకూడ నెఱుఁగుదువు! (సదూషణముగా)

ఉ. శీలఁ దెమల్చి తూండ్లు గబ ♦ ళింపఁగ మున్నె డెయ్యంబునక్కటం
గోరిలిచె పద్మసౌరభము ♦ గుమ్మనుకమ్మని నీళ్లు, లాపయిన్
దేలిచె తుంపురుంజడిని ♦ నీటునఁ, దిన్నని కాఁడ కామతో
నేలాకౌ తామరాకుగొను ♦ గొత్తదు హత్తినకూరిమిం దుదిన్. ౩౪

ఏమి! నాకుఁ బ్రత్యుత్తర మీయక నన్ను నిరసన చేయుచున్నది? అహ్హా! యెంతటి మూఢుఁడను! ఈ వనచరునితో మకరందునితో సంభాషించినట్లు సంభాషించుట నాదే తప్పు, హా! మిత్రుఁడా! మకరందా!

తే. గీ. ఎందుకీ దిక్కుమాలిన ♦ యేడ్పు బ్రదుకు?
ఎందుకు ఫలానుభవము లే ♦ నంద? యెందు
కదియు నీవును లేని గో ♦ ష్ఠు రైన? యెందు
కవరొ ఘటియించు ముద మిసీ ♦ యొండమావు. ౩౫

మక:-వింతగా నున్నది. ఇతఁడు మోహాంధకారములో మునిఁగి యుండియు నడుమనడుమ నన్నుఁ దలఁచుకొనుచు నేయున్నాఁడు! ఇది చూడఁగా నితనికి నాయెడఁగల సహజస్నేహముయొక్క సంస్కారము దనికి మరల నే హేతువుచేతనో తల యెత్తుచున్నది. కనుక నేను చెంతనున్నట్టే భావించుచున్నాఁడు. [ఎదుట నిలిచి] ఆ మందభాగ్యుఁడు మకరందుఁడు వీఁడె నీప్రక్కనే యున్నాడు.

మాధ:-హా! ప్రియవయస్య! నన్నుఁ గౌఁగిలించుకొని యాదరింపుము. ఇంక మాలతివిషయమున నిరాశుఁడ నైనాఁడను.

మక:-ఇదిగో ప్రాణేశ్వరుని సంభావించుచున్నాను. [చూచి జాలిగా] అయ్యో! నన్నుఁ గౌఁగిలించుకోవలెనని యభిలషించుచునే స్మృతి దప్పినాఁడు! చాలు నింకమీఁద జీవితాశ యేడిపింప నక్కఱలేదు. ఏ విధమునఁ జూచినను నాకుఁ బ్రియవయస్యుఁడు లేఁడని సరిచేసికొనుటయే యుక్తముగా నున్నది. హా! వయస్యా!

తే. గీ. చేఁడి పొంగుగ నెయ్యంబు ♦ పెంపుమీఱ
వనిత మనమిత్రముఁగ నుండ ♦ మదరి నీకు
నాపదలు వచ్చెననియే భ ♦ యంబుగ నెనొ
నట్ట మరణ్యోనదల్ల క్ష ♦ ణంబులోన. ౩౬

నాకుఁ జూడఁగాఁ గడచిపోయిన గడియలే యెక్కుఁగుగాఁ గనఁబడు చున్నవి. ఏబాధలొందుచున్నను ప్రియమిత్రుఁడు జీవించి యుండుటను కన్నులతోఁ జూచుచోనుండెడివాఁడను. మఱియిప్పుడో నాకు,

శా. భారంబయ్యె శరీర మయ్యొ! బ్రదుకున్ ♦ వ్యజంపు మోసయ్యె, ది
గ్వారంబయ్యె మహాస్వ, మింద్రియములున్ ♦ వ్యర్థంబులయ్యెన్, సుదు
ర్వ్యాసంబై తమమావరించె సకల ♦ ప్రాణి ప్రపంచంబునన్
ఘోరంబయ్యెను గాలమీవగిది న ♦ న్నుంగూర్చి నీవేగుటన్. ౩౭

[ఆలోచించి] మాధవునిమరణముఁ గన్నులారఁజూచి యిప్పుడేమి చేయుదునని బ్రదుకుదును? కనుక నీగిరిశిఖరమునుండి పాటలావతిలోఁబడి యతనికన్న ముందుగానే పరలోకగతుఁడ నయ్యెదను [జాలిగా నిటునటు పరచిచూచి] హా! యెంతకష్టము!

మ. పరసస్నేహవిలాస భాసురములై ♦ జానొందు నాలేమ వి
త్తరపుంజూపులుదేఱఁ గ్రొత్తగముమున్ ♦ ద్రావం దటస్థించెనా
స్ఫురదిందీవరపత్రకాంతి యగుచున్ ♦ శోభిల్లునీమేను సు
స్థిరతన్ బిగ్గఁగవుంగిలించియును ద్వ ♦ త్రింగాంచ నిష్ఠింతయున్. ౩౮

అహా! సమస్తగుణములకు గనియైనిల్చిన మహానుభావుని కిటువంటి యవస్థపట్టినది! మిత్రుఁడా! మాధవా!

మ. గ్రసియింపంబడె రాహుచే విమలరా ♦ కాచంద్రబింబంబు దా
నిమమంతై తొలివానమబ్బు విడిపో ♦ యెన్ వాయువేగంబుచేఁ
బొసఁగంబండిన తీయమామిడియునున్ ♦ బ్రోదయ్యె దావాగ్నిచే
వసమాన ప్రగుణాభిరాముఁడవు నీ ♦ వయ్యా! మృతుండైతివే. ౩౯

ఇట్లు గతించినవాఁడయినను బ్రియవయస్యుని గాఁగిలించుకొని వా
డను. నన్నిప్పుడతఁడు కోరినకోరిక యిదియేకదా! [కాఁగిలించి] హా!
వయస్య! హా! విమలకళానిధీ! హా! గుణాకర! హా! మాలతీ స్వయం
గ్రాహజీవితేశ్వర! హా! కామందకీమకరందానందముగ్ధచంద్ర! హా! మాధవ!
ఇదిగో నీవు జీవించియుండఁగా నీకు లభింపని మకరంద బాహుపరిష్వం
గమ్ము నీయవసానదశయందుఁగలుగుచున్నది! మిత్రుఁడా! యిటుపయిని మక
రందుఁడు క్షణమాత్రమైనను జీవించునని తలఁపవద్దు. ఏమంటేని,

గీ. జనన మాదిగ నాదు పా ◆ త్తునను పెరిఁగి
తల్లి చనుఁబాలు సమముగాఁ ◆ ద్రావి యిప్పు
డొకఁడవును బంధులిచ్చు తి ◆ లోదకంబు
నాను లేకుండఁద్రావుట ◆ న్యాయమగునె. ౪౦

[జాలిగా విడిచిపెట్టి యిటునటు నడచి] ఇదిగో నీదిగువను పాట
లావతి ప్రవహించుచున్నది. దేవీ! పాటలావతీ!

క. ప్రియమిత్రుఁడెందు ◆ దేహముఁ
గయికొనునో యందె నేను ◆ గయిగొంటయు నెం
డియు నతఁడెందేగునో యను
నయముగ నందేగుటయును ◆ నాకవికోర్కుల్. ౪౧

[అని పడఁబోవుచున్నాఁడు.]

సౌదా:—[తొందరగాఁ బ్రవేశించి నివారించి] వత్సా! సాహ
సము చేయకు.

మక:—[చూచి] అమ్మా! నీవెవ్వతెవు? ఎందునిమిత్తము నన్నువారించు
చున్నావు?

సౌదా:—నీవు మకరందుఁడవేనా?

మక:—విడిచిపెట్టుము. ఆ మందభాగ్యుఁడను నేనే.

సౌదా:- వత్సా! నేను యోగినిని. మాలతి యంగమచ్చమును దెల్పితివి. [వకుళమాలికను జూపుచున్నది.]

మక:- [తెప్పిరిల్లి జాలిగా] మాలతి బ్రతికియున్నదా?

సౌదా:- ఉండకేమి? వత్సా! మాధవుఁడేదేని బ్రతుకుగోరని పనిచేసిన వాఁడు కాఁడుగదా? శరీరత్యాగమునకుఁ బూనుకొన్నవాఁడవులే! నా యొడలు కంపించుచున్నది.

మక:- దేవీ! అతఁడు మూర్ఛనొంది పడియుండఁగా విరక్తినొంది విడిచివచ్చినాఁడను.

సౌదా:- అటయిన శీఘ్రముగాఁ బోదమురమ్ము. సంభావింతము. [త్వరితముగా నిటు నటు దిరుగుచున్నారు.]

మక:- [చూచి] అదృష్టవశమున వయస్యుఁడు తెలివినొందియున్నాఁడు.

సౌదా:- వీరి యిరువురి శరీరాకారమును మాలతిచెప్పినట్లుగానే యున్నవి.

మాధ:- [ఊర్పుపుచ్చి] ఎవరుచెపుమా నన్ను మేలుకొలిపినారు? (ఆలోచించి) నిశ్చయముగా నీపని నాయవస్థ విచారింపక చేసిన యీ నవజలధరపవనునిది. భగవంతుఁడవైన యో పౌరస్త్యవాయూ!

శా. మోదంబుం గననిమ్ము చాతకములం ♦ భోదంబులం ద్రిప్పుమీ
నాదం బిమ్ముగఁ జేయ నిమ్ము శిఖులన్ ♦ జల్పింపు గేదంగులన్
ఖేదం బెట్టిటు మూర్ఛతో మఱచుచున్ ♦ నేనుండఁ జైతన్యమున్
వ్యాధిన్ వెండియుఁ దెచ్చిపెట్టి విరహిన్ ♦ బాధించెదేలా ననున్!

మక:- జగత్ప్రాణుఁడైన యీ వాయుదేవుఁ డిప్పుడు లెస్సయినపని చేసినాఁడు.

మ. అలరుం గేదఁగితావులూని నగరీ ♦ ప్రౌఢాంగనాస్యంబు లి
మ్ముల లోలాలకవల్లిచాలనమిషన్ ♦ ముద్దాడి యుత్ఫుల్లనీ
పలసత్కోకశపుటీరజోలుఠదళి ♦ వ్యాహారరమ్యంబులై
లలితగానిలముల్ వియోగుల నిటుల్ ♦ రారాపులం బెట్టెడున్. ४३

మాధ:- భగవంతుఁడైన దేవవాయువూ! మేలుకొల్పితివిగనుక నిన్నే ప్రార్థించుచున్నాఁడను.

చ. దళితకదంబ కుట్మలక ♦ దంబ పరాగముతోడి పాటుగాఁ
జెలియెటనున్నదో యటకుఁ ♦ జేకొనిచేర్పుమి నాదుప్రాణముల్
పలుకఁగఁజాలనేని యటు ♦ చానయొడల్ స్పృశియించి చల్లనై
యలరెడి వస్తువేదయిన ♦ నంపుము నాకిట దిక్కునీవెగా. ४४

(అని దోసిలిబట్టి ప్రణమిల్లుచున్నాఁడు.)

సౌదా:- ఆనవాలాసంగుటకిదే మంచిసమయము. (దోసిటవకుళమాలిక నుంచుచున్నది.)

మాధ:-(సాకూతముగాను సహర్షముగాను సవిస్మయముగాను) ఇదియెట్లు? కామోద్యానమందు నేను రచియించి పంపఁగా ప్రియురాలు తన గుబ్బచన్నులమీఁదఁ దాల్చి ముద్దుసేసిన పొగడపూదండయిది. (చక్కఁగాఁ బరిశీలించి చూచి) సందేహమేల? అదేయిది.

చ. కలికి నవేందుసుందరముఁ ♦ ఖంబున గాంచఁగ హేలమై నిర
ర్గళముగఁ బుట్టినట్టి పులు ♦ కంబును లోన నడంచు కొంటకై
యలరులు హెచ్చుదగులుగ ♦ నట్టిటుపెట్టి రచించినట్టిదిగా
బొలుపుగ నాలవంగికకు ♦ మోదముపెంచె మహాప్రసాదమై. ४५.

(వెఱ్ఱిసంతోషముతో లేచి) ఓకోపశీలురాలా! మాలతీ! ఇదియంత యుఁజూచుచు నూరకున్నావా? (కోపపడినట్లు) ఓసి నాయవస్థయెఱుఁగనిదానా?

చ. వెడలెడిరీతిఁ బ్రాణములు ♦ వ్రీలెడి పోలిక డెందమట్టెమం
డెడుగతి నంగకంబులును ♦ నిండఁగఁ గ్రమ్మినమాడ్కి మోహమీ
వదువుననుండ మేలమఁటె ♦ వైళమ ప్రోవఁగఁ జెల్లుఁగాక, నా
గొడ దయమాలి యుండఁదగు ♦ సీ? కనుఁబండువు సేయఁగాఁగదే.

(అంతటఁ జూచి విసుగుతో) ఏదీ యిక్కడ మాలతి? (వకుళమాలను గూర్చి) ఆహా! ప్రియురాలికి వచ్చిన నెచ్చెలివయి పరమోపకారముం జేసితివిగదే?

ఉత్సాహ. ఎదురులేక బెట్టిదముగ ♦ నించువిలుతుఁ డేచి వె
ల్లిదపు వలపుఁదలఁపునిలిపి ♦ లీల మరులుకొలుపఁగాఁ
గదిసి నీవు సుదతి కపుడు ♦ కౌఁగిలిచ్చి తదియెనా
పొదువుఁ గౌఁగిలయ్యెఁజెలియ! ♦ ముదితఁ బ్రోవఁగలుగుటన్.

(జాలిగా నిట్టూర్పు పుచ్చి)

మ. బలితంపుం జెలికారపు న్నెలవులై ♦ గాఢానురాగంబులై
యలరుం గైదువు జోదు వేఁడిమికి సా ♦ హాయ్యానుకూలంబులై
కలితానందము తెచు నాగళమునం ♦ గళ్యాణి కంఠంబునం
బలుమాఱైన భవద్గతా గతములన్ ♦ భావించి దుఃఖించెదన్. ౪౫

(హృదయమందుంచుకొని మూర్ఛకొందుచున్నాఁడు.)

మక:-(చేరవచ్చి) చెలికాఁడా! ఊఱడిల్లుము.

మాధ:-(ఊఱడిల్లి) వయస్యా! మకరంద! నీవు చూడలేదా యేమి? ఎందుండియో మాలతి చటుక్కునఁ దనహస్తమును నాకొసంగినది. ఇది యేమని భావించెదవు?

మక-- ఈ పూజ్యురాలు యోగీశ్వరి. ఈ మాలతీ ప్రత్యభిజ్ఞానమును గొనివచ్చినది.

మాధ:-(దోసిలిపట్టి) అమ్మా! అనుగ్రహించి నా ప్రియురాలు జీవించియున్నదేమో చెప్పుము.

సౌదా:- వత్సా! ఊఁఅడిల్లుము. ఆ కళ్యాణి జీవించియున్నది.

మాధ:- మక:-(ఊర్పుపుచ్చి) అమ్మా! అటయిన నీవృత్తాంతమేమో తెలవిమ్మా.

సౌదా:- వెఱకఁగరాళశక్తిగుడిలో నఘోరఘంటుఁడను ఖడ్గపాణియొకఁడు హింసింపఁబడినాఁడు.

మాధ:-(ఆవేగముతో) అమ్మా! చాలు నామీఁదఁ దెలిసినది.

మక: - మిత్రుఁడా! ఏమిటది?

మాధ: - వయస్యా! మఱేమున్నది? కపాలకుండల కోరిక యీడేరినది.

మక: - అమ్మా! ఇది యిట్లేనా?

సౌదా: - వత్సా! అట్లే. ఇతఁడు చెప్పినట్లే.

మక: - అన్నా! యెంతకష్టము!

తే. గీ. అలఘు తిరశ్శోభఁ గనుపొంటెఁ ♦ గలువకొలనఁ
గలయ శరదిందుచంద్రిక ♦ గాసె నేని
మేలుగనె యుండి యుండు న ♦ కాలమేఘ
వితతి యెడఁబాపె నేమి దు ♦ ర్విధియొకాని. ౪౯

మాధ: - హా! ప్రియురాలా! మాలతి! అతిభీభత్సమగు కష్టమనుభవించితివి!

తే. గీ. అల కపాలకుండల చేత ♦ నప్పు డీవు
చిక్కియెట్లుంటివో కదా ♦ చిగురుబోఁడి
రెచ్చిగీడొనర్చెడి ధూమ ♦ రేఖచేత
నలమికొనఁబడ్డ జాబిల్లి ♦ కలయపోలె. ౫౦

భగవతి! కపాలకుండలా!

తే. గీ. లాలనీయమ దాని సౌ ♦ ల్యంబు నీకుఁ;
బాలనవుగాక మఱి శివ ♦ తాలివైతి;
సురభి కుసుమంబుఁ దలఁదాల్పఁ ♦ జూచుఁ గాక
నలిపి వైచునెవఁడు చర ♦ ణములఁ ద్రొక్కి? ౫౧

సౌదా: - చాలు నీకళవళపాటు విను,

క. ఆయెడఁ దత్పరిపంథిని
నై యే నడ్డపడకున్న ♦ నది పాపంబుం
జేయుటకు వెనుకఁదీయదు
పో! యతిదుష్కరుణురాలు ♦ బుద్ధిఁదలంపఁగ. ౫౨

ఉభయులు: - (ప్రణమిల్లి) మహానుభావురాలికి మాయెడఁ బరి పూర్ణానుగ్రహమున్నది. నీవు మాకు నిర్హేతుక బంధువురాలవనియే కాని నీవెవ్వరో మే మెఱుఁగకున్నారము.

సౌదా: - ఇదిగో తెలిసికొందురుగాని. (లేచి) ఇప్పుడు నేను,

తే. గీ. గురులసేవించి కావించి ♦ ఘోరతపము
మంత్రతంత్రసమాధుల ♦ మహిమలభ్య
సించిపడసినయాకర్ష ♦ సిద్ధిమీకు
ఘంబునకుఁగాను వినియోగ ♦ పఱచుదాన.

(మాధవునితోఁగూడి నిష్క్రమించుచున్నది.)

మక: - ఏమి మాయగానున్నది?

తే. గీ. అంతలో మెఱుపంతలో ♦ నంధకార
మగుచు మిఱుమిట్లుగొని కన్ను ♦ లట్టె మొగిడె
వెలుపుగదిలెడు (చూచి భయముతో) లేఁడేమి ♦ ప్రియవయస్యుఁ
(ఆలోచించి) డౌను దలిసిన దదిసిద్ధు ♦ రాలి మహిమ. ౫౪

(సవితర్కముగా) ఇది యేమో యనర్థహేతువని యెఱుఁగక పొరఁ
బడుచున్నానేమి?

ఉ. అచ్చెరు వయ్యెడున్ మిగుల ♦ నప్పటి యాకథలెల్ల జ్ఞప్తికిన్
వచ్చెడు; భీజ్వరం బెగుర ♦ వైచెడుఁ గ్రొత్తగఁ బుట్టి; యంతలో
నచ్చుపడుం గడుం దెలివి ♦ యాక్షణమే నశియించి మబ్బుగాఁ
జొచ్చెడుఁ; జిత్రమై మదిని ♦ శోకము మోదము రెండుఁగూడెడున్.

కావున నీ యరణ్యావసానమున సుహృద్వర్గముతోఁ బ్రవేశించి యుండు భగవతికడకుం బోయి యామె కీవృత్తాంతమును నివేదించెదను.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

నవమాంకము—సంపూర్ణము.

-O-

# మాలతీమాధవము

## దశమాంకము

రంగము:— పూర్వోక్తారణ్యమందు మఱియొకవైపు.

[తరువాతఁ గామందకీ మదయంతికా లవంగికలు ప్రవేశించుచున్నారు.]

కామం: - (జాలిగా, కన్నీళ్ళతో) హా! బిడ్డా! మాలతీ! నా యొడిలో నలంకారముగాఁ గూర్చుండువు గదే! యిప్పుడెందుఁబోతివే? మాఱుపలుకవేమె?

ఆ. వె. జనన మైనదాదిఁ ♦ గనుల పండువుసేని
గడియ కొక్కసుద్దు ♦ నడపి యింపుఁ
బెంచు నీదు చిన్నె ♦ లెంచంగ నవి యొడల్
దగులఁబెట్టు గుండె ♦ పగులఁ గొట్టు. ౧

మఱియు నోసి కూతుఁరా!

తే. గీ. వ్యవధిలే కేడ్పునవ్వులు ♦ వరుసఁ బొలయ
మొలక పలు మొగ్గ లొకకొన్ని ♦ ముద్దుగులుక
వచ్చియును రాని తొక్కుడుల్ ♦ ప్రమద మొసఁగ
నమరు చిననాఁటి నీముఖ ♦ కమలమెంతు. ౨

ఇతరులు: - [కన్నీళ్ళతో] హా! ప్రియసఖి! సుప్రసన్నముఖ చంద్ర సుందరి! ఎందుఁబోతివే? అక్రూరదైవము దిక్కుమాలినదాననైన నీశరీరమున కేమి యసిఘాతముఁ దెచ్చిపెట్టినాఁడో గదే! హా! మహాభాగ! మాధవ! నీవలనఁ బ్రాణిలోకమునకు గలిగినయుత్సవ మస్తమించుట కుదయించి వంతవేపైనను బట్టకపోయెనే!

కామం: - (సవిశేషఖేదముతో) హా! బిడ్డలారా!

క. నవరాగరసము సుభగము
నవుమీఱఁగి కవుఁగిలింత ♦ యలవిధినియతిన్
లవలీలవంగముల పెనఁ
కువ మడిగాలికిన్నిబోలెఁ ♦ గూర్పెడలి చెడెన్. ౩

లవం: - (ఆరాటముతో) హా! క్రూరహృదయమా! వజ్రముతోఁ జేయఁబడితివి కాఁబోలును. నీయాస లుడిగినను వ్రక్కలు గాకున్నావు. (అని ఱొమ్ము మోదుకొని మూర్ఛిల్లుచున్నది.)

మద: - చెలీ! లవంగికా! కొంచెము సేపూఱడిల్లియుండవే!

లవం: - చెలీ! మదయంతికా! ఏమి చేయుదునే? వజ్రలేపము పెట్టి యతికినట్లు ప్రాణము నన్ను వదలి పోకున్నదే!

కామం: - వత్సా! మాలతి! పుట్టినదిమొదలు నీకు లవంగిక మీఁదఁ బంచప్రాణములుగదా! అది నీకొఱకుఁ బ్రాణములు విడుచుచున్నదే! ఏల జాలినొందవే అమ్మా?

తే. గీ. దీపశిఖ స్నేహపూర్ణవ ♦ ర్తికను బోలె
నుజ్జ్వలాలోకవైన నీ ♦ వొకట దీని
నుజ్జగింపంగ రాజిల్ల ♦ కున్నదిపుడు
మొగము మసివాఱినట్లులు ♦ పొలుపఱంగ. ౪

హా! కల్యాణీ! నీవు కామందకి నెట్లు వదలిపెట్టుచున్నావే? ఓ దయావిహీనురాలా! నీవు వెచ్చగా నాయొడిలోనే కాదఁటే పెరిఁగి పెద్దదానవైతివి?

ఉ. కొంచక నిన్నుఁ బాల్యదుపు ♦ గోలెను దంతపుబొమ్మఁ బోలె నా
డించితిఁ; బెంచి పెద్దగ ఘ ♦ టించితి బుద్ధులు నేర్పి; పెండ్లి గా
వించితి మంచియోగ్యుఁడగు ♦ పెండ్లికొమారునిఁ జూచి తెచ్చి; యి
వ్వెంచఁగ నీకుఁ బ్రేముడిని ♦ నెక్కుడుగానఁటె యమ్మకంటెనే. ౫

(విలవిలలాడుచు) హా! చంద్రముఖి! యిప్పుడు నిరాశురాలనై తిని గదే!

ఉత్సాహ.

మొలకనవ్వు నిర్నిమిత్త • మొలుకు ముద్దుమొగమునం
దొలఁక, నుదురునిగయు గార • ధూప ధూపితములుగాఁ
గులికి యొడిని నీడుచున్న • గుడుచుకొడుకుఁ జూడఁగన్
గలుగు భాగ్య మెదవదమ్మ్యె • నాయభాగ్య మేమనన్. ౧

లవం: - అమ్మా! భగవతి! అనుగ్రహింపుము. ఇంకఁ బ్రాణములను నిలుపఁజాలను. ఈ గిరి శిఖరమునుండి క్రిందఁపడి చచ్చి సుఖపడియెదను. ముందు జన్మమునందయినను నేను బ్రియసఖిని జూడఁగలుగులాగున నాకు దేవి యాశీర్వచన మిచ్చుఁగాక! (అని గిరి శిఖరమునుండి పడఁబోవుచున్నది.)

కామం: - ఓసీ! లవంగికా! బిడ్డనుబాసి కామందకిమాత్రమిఁక మీఁద బ్రదుకఁగలదఁటే? ఈ వియోగదుఃఖము మన యిరువురకును సమానమే. మఱియు,

తే. గీ. కర్మలకు భిన్నఫలములు • గలుగుకతనఁ
గలుగుఁ గలుగక పోవు సం • గమము మనకు;
నైనఁ బ్రాణపరిత్యాగ • మందు మాత్ర
మలఘు సంతాప శాంతియన్ • ఫలము గలదు. ౨

లవం: - భగవతి సెలవిచ్చినట్లే. (అని లేచుచున్నది.)

కామం: — (దయతోఁజూచి) వత్సా! మదయంతికా!

మద: - అమ్మా! యేమి సెలవు? ముందు నడువుమనెదవా? అందులకు సిద్ధముగా నేయున్నాను.

లవం: - చెలీ! నాబుద్ధివిని యీ యాత్మనాశ ప్రయత్నమును గట్టిపెట్టుము, నన్ను మఱచిపోకుము.

మద: - (కోపనువచ్చినదానివలె) పోవే! నేను నీవు చెప్పినట్లు వినుదాననుగాను!

కామం: - అయ్యో! యీబిడ్డ దారుణము తలపెట్టినది.

మద: - (తనలో) నాథా! మకరందా! నీకు నమస్కారము.

లవం: - దేవీ! యిదియే మధుమతీ ప్రవాహముచేఁ బవిత్రపాద మైన పర్వతవిటంకము.

కామం: - ఇంక నాలస్యమెందుకు? (అందఱును బడఁబోవుచున్నారు.)

[తెరలో]

ఆశ్చర్యము!

తే. గీ. అంతలో మెఱుపంతలో ♦ నంధకార
మగుచు మిఱుమిట్లుగొని కన్ను ♦ లట్టెమొగిడె
వెఱపుగొలిపెదు;
కామం: - (చూచి హర్షవిస్మయములతో)ఏమినా ♦ బిడ్డవీఁడె!
మక:-(ప్రవేశించి)అగుదు నిదియెల్ల నలసిద్ధు ♦ రాలిమహిమ.

[తెరలో]

ఏమి జనసమ్మర్దము! అతిదారుణముగా నున్నది!

తే. గీ. మాలతి యవస్థఁదెలిసి సం ♦ సారమందు
జీవితమునందును విరక్తిఁ ♦ జెంది భూరి
వసువు కృతనిశ్చయుండయి ♦ వహ్నిసార, సు
వర్ణబిందుఁ జేరెనిఁకేటి ♦ బ్రతుకు మాకు.

మద: - లవం: - ఇప్పుడే మాలతీమాధవులఁ జూడఁగలుగుదుమన్న సంతోషమును ఇప్పుడే భూరివసువును గుఱించి దుఃఖమునా?

కామం:- మక:- అన్నా! అదృష్టమును కష్టమును! వింతగా
నున్నది!

తే. గీ. అంపపుంగోఁత, మంచిగం ◆ దంపుఁబూఁత
యేమియిది యేకకాలమం ◆ దే ఘటిల్లె!
మబ్బుగనఁబడ దిదియేమి ◆ మాయొఁకొరియు
నగ్నికణములు నమృతంబు ◆ నవిరళమ్ముగ. ౧౦

తే. గీ. విసము సంజీవనిఁ గలయఁ ◆ గొసికినట్లు
చీఁకటిని వెల్గు నేకంబు ◆ సేసినట్లు
కులిశ శశికరముల జత ◆ గూర్చినట్టు
లయ్యెఁబో! యిప్డుమనభాగ్య ◆ మరసిచూడ. ౧౧

[తెరలో] హా! తండ్రీ! ఉడుగుము. నీ ముఖపద్మమును జూడవలెనని మనసు పడుచున్నాను. దయఁజూచి నన్నాదరింపుము. ఆహా! నానిమిత్త మాచక్రవాళభూచక్రమునకెల్ల మంగళైక నిర్మలప్రదీపమగు నీ దివ్యదేహమును బరిత్యజించుచున్నావు! నే నెంత నిర్దయురాలనో కాని మిమ్మునందఱను విడిచి సిగ్గునొందకున్నాను?

కామం:- హా! బిడ్డా! మాలతి!

తే. గీ. చచ్చి బ్రతికినయట్లుగా ◆ వచ్చినీవు
కంటఁబడితివో లేదో యీ ◆ వెంటనిపుడె
చంద్రకళ మ్రింగ రాహువు ◆ చందమునను
సిద్ధమైయున్నది మఱొక్క ◆ చెడుగు నీకు. ౧౨

మద:- లవం:- హా! ప్రియసఖీ!

[అప్పుడు మూర్ఛనొందిన మాలతినిదీసికొని మాధవుఁడు
ప్రవేశించుచున్నాఁడు.]

మాధ:-ఎంతకష్ట మెంతకష్టము!

తే. గీ. వెలఁదుక ప్రవాస మెట్లొ తా ♦ వెళ్ళఁబుచ్చి

వెండి సంశయించెడు నొందు ♦ విధముగానె;

పండియుండఁగఁ బ్రాణుల ♦ భాగ్యఫలము

వెసఁ గుదుపకుండ నెవఁడు త ♦ ప్పింపఁగలఁడు? ౧౩

మక:-చెలికాఁడా! మఱి యా యోగిని యెక్కడ నున్నది?

మాధ:-

ఆ. వె. ఇరువురమును గలిసి ♦ యే వేగమొప్ప శ్రీ

పర్వతంబునుండి ♦ వచ్చినార;

మింతలోన నడవి ♦ నెవ్వరో మొఱవెట్ట

వినియె మాయమగుచుఁ ♦ జనియె సఖుఁడ ౧౪

కామం:-మక:-ఓ మహాత్మురాలా! మరల మమ్ముఁ గాపాడుము. మాకుఁ బొడసూప కున్నా వేమి?

మద:-లవం:-చెలీ! మాలతీ! ఇదిగో నీ చెలికత్తెలము మేము [పడఁ కునొందుచు] అమ్మా! భగవతీ! రక్షింపుము! రక్షింపుము! దీని హృదయ మిప్పటికిని ఊపిరిపుచ్చక నిశ్చలముగా నున్నది! హా! భూరివసూ! హా! ప్రియసఖీ! మీరిరువురు నొకరినిమిత్త మొకరు ప్రాణములు విడుచుచున్నారు!

కామం:-హా! బిడ్డా! మాలతీ!

మాధ:-హా! ప్రియురాలా! మాలతీ!

మక:-హా! ప్రియసఖీ! [అందఱు మూర్ఛిల్లి మరలఁ దెలివి నొందు చున్నారు.]

కామం:-ఏమిది? యింతలోనే పట్టపగలు మబ్బుపట్టి మీఁద నీటి చినుకులు పడుచున్నవి! ప్రాణ మెంతహాయిగా నున్నది!

మాధ:—[ఊర్పుపుచ్చి] చూడుఁడు! చూడుఁడు! మాలతికిఁ దెలివి వచ్చినది! ఈమెకిప్పుడు,

మ. నెగయుంజన్నులు తొమ్మనన్ నిబిడమై ♦ నిట్టూర్పు దిట్టాడఁగా,
సొగసుంగన్నులు తొంటిక్రొన్నిగనిగల్ ♦ సూపించి దీపించెడున్,
మొగముం జక్కఁ గలంకదేఱెడును స ♦ మ్మోహంబువాయంగ లేఁ
బగటంగ్రొంజిగిఁదాల్చి పొల్చి కనెనా ♦ పద్మంబు, చందంబునన్: ౧౫

[తెరలో]

తే. గీ. నందనసమేతుఁడై చర ♦ ణములఁ వ్రాలు
నుర్వీపతిఁ గయికొనకగ్ని ♦ నుఱుక నున్న
భూరివసువట్టి నామాట ♦ గారవించి
మరలుచున్నాఁడు పూర్ణవి ♦ స్మయములడర. ౧౬

మాధ:-మక:-దేవీ! యదృష్టము వర్ధిల్లుచున్నది!

తే. గీ. అలరునేయమ్మ వాగమృ ♦ తాంబుధార
లంబుదము వారిధారల ♦ నతికరించి,
చేరవచ్చెడు మనల నా ♦ పెద్ధురాలు
వడిగఁ దొలఁగద్రోచికొనుచు ♦ వారిదముల. ౧౭

కామం:—ప్రియముగదా మనకు?

మాల:-అదృష్టవశమున నిప్పటికిఁ దప్పిరిల్లినాను!

కామం:—[సంతోషభాష్పములతో] పుత్త్రి! రమ్ము! రమ్ము!

మాల:—హా! భగవతియా? [అడుగులఁ బడుచున్నది.]

కామం:—[లేవనెత్తి కౌఁగిలించి శిరస్సుమూర్కొని.]

ఆ. వె. బ్రదుకవమ్మ నీవు ♦ బ్రదికింపవమ్మ నీ
ప్రాణసముని మఱియుఁ ♦ బ్రాణసఖుల;

హిమ సుశీతలాంగ ♦ కములఁ గౌఁగిటఁజేర్చి
సేద దేర్పవమ్మ ♦ చెలిని, నన్ను. ౧౭

మాధ:-వయస్యా! మకరందా! మాధవున కిప్పుడీ జీవలోకముపా దేయమైనది.

మక:-[సహర్షముగా] ఇది యిట్టిదే.

మద్య:-లవం:-ప్రియసఖీ! నిన్నుఁ దిరిగిచూడ మఱిగొంటిమి గదే! మమ్ముఁ గౌఁగిలించి యాదరింపవే!

మాల:-హా! ప్రియసఖులారా! [అని యిరువురను గౌఁగిలించుకొనుచున్నది.]

కామం:-వత్సలారా! యేమిటిది?

మాధ:-మక:-దేవీ!

పంచ. కపాలకుండలాగ్రహంబు ♦ గల్గఁజేసినట్టి యీ
యపారపు న్విపత్తునుండి ♦ యీమహాత్మురాలు మే
మపాయ మొందకుండఁగా ను ♦ పాయమొంప్ప సత్కృపా
ప్రపూర్ణబుద్ధిఁబూని మమ్ముఁ ♦ బట్టి యుద్ధరించెగా. ౧౮

కామం:-అఘోరఘంటునిఁ జంపుటచేతనే వారియింత పుట్టినది?

లవం:-మద:-ఓహో! యేమి యాశ్చర్యము! దైవయోగముతో నంత సెంత దారుణమై చివర కెంతరమణీయమైనదో!

సౌదా.-[ప్రవేశించి] భగవతీ! ఇదిగో నీపూర్వ శిష్యురాలు మ్రొక్కుచున్నది.

కామం:-ఓహో! సౌదామినీ! కళ్యాణము!

మాధ:-మక:-ప్రథమ శిష్యురాలైన యీ సౌదామినియెడ భగవతి కెంత పక్షపాతమో! అందుచేతనే యీమె యింతటి మహాకార్యము చేయుట తటసించినది.

* కామం:-

సుగంధి. రావెయమ్మ! రావెతల్లి ♦ రావె మ్రొక్కెదేటికే
రావె నన్నుఁ గౌఁగిలించి ♦ రంజిలంగఁ జేయవే
యీవు నేనుఁజూచుకొంట ♦ యెన్నినాళ్ళకబ్బెనే
జీవమిచ్చి మంత్రికిం బ్ర ♦ సిద్ధపుణ్యవైతివే. ౨౦

మఱియు,

మ. అలనాఁడైన ప్రిమాణబీజము భ ♦ ద్వ్యాపార పారీణతన్
ఫలియించెం గదు; మచ్చటయ్యెడును నీ ♦ ప్రజ్ఞల్ గనుంగొన్న; లో
కులకు న్నీయతిబోధి సత్వమహిమల్ ♦ కొండంతలై యీగతిన్
దెలియంగాఁ బడియెన్ గుమారి! జగతిన్ ♦ నీవేసుమీ వంద్యవున్.

మద: - లవం: - ఆ మహానుభావురాలు సౌదామిని యీమెయేనా?

మాల: - ఈమెయే. ఇన్నిమె భగవతి కామందకి యాదరించినట్లే యాదరించి కపాలకుండల నదలించి నన్ను విడిపించితెచ్చి తన యింటిలోఁ బెట్టుకొని యోదార్చినది. ఇంతేకాక నేనానవాలిచ్చిన పొగడ పూదండను జేతఁబట్టుకొని యిందులకు వచ్చి మిమ్ము నందఱ నుద్ధరించినది.

మద: - లవం: - మాచిన్న భగవతికి మామీఁదఁ బూర్ణానుగ్రహ మున్నది.

మాధ: - మక: - ఆహా!

* ఉత్సాహ. రమ్ము! రమ్ము! భూరివసువు ♦ ప్రాణమిచ్చి పుణ్యభా
రమ్ము! మాట గట్టుకొన్న ♦ ప్రణయభావసేవధీ!
అమ్మ! నిన్నుఁ గంటనేటి ♦ కబ్బె; నేఁజెలంగ మో
దమ్మునం గవుంగిలింపు ♦ తక్కు మేలమొ్రక్కఁగన్.

మూలము నెక్కువగా ననుసరించిన పాఠము.

క. చింతింపం బడకుండం, జింతామణిరైన మేలు ♦ సేకూర్పదు దా
వింతగద యింతమేలు న, చింతితముగ మనకు నీవె ♦ సేయుటచూడన్!

సౌదా:- (తనలో) అయ్యో! వీరి యత్యంత సౌజన్యముఁ జూచి నాకు బిడియమగుచున్నది. (ప్రకాశముగా) దేవీ! ఇదిగో నందనుఁ డపరిమితానందముతో రాజుగారిని బ్రార్థింపగాఁ బద్మావతీశ్వరుఁడు భూరివసువు సమక్షమందు చిరంజీవియగు మాధవునిపేర లిఖించిపంపిన యుత్తరము. (అని యుత్తరమిచ్చుచున్నది.)

కామం:-[పుచ్చుకొని చదువుచున్నది]"స్వస్త్యస్తు"!

చ. "ఘనగుణసంపదం బ్రథమ ♦ గణ్యుఁగులీను, విరస్త దుస్తమున్
ఘను నిను నల్లునిం బడయఁ ♦ గంటిని; గంటి ముదంబు; గావునం
దనరఁగఁ బూర్వరాగ ఘటి ♦ తన్ మదయంతిని సైత మిప్డ ని
న్నెగసినయిష్టమిత్రునకు ♦ నిత్తుము వెండియు నీకుఁ బ్రీతిగన్." ౨౩

[మాధవు నుద్దేశించి సహర్షముగా] వత్సా! వినుము.

మాధ:-విన్నాఁడను, సర్వవిధములఁ గృతార్థుడనైనాఁడను.

మాల:-అదృష్టవశమున హృదయమును బాధించుచున్న యీ శంకాశల్యముగూడ నిప్పుడు లాగివేయఁబడినది.

లవం:-ఇప్పుడు మాధవునికోరికలు సంపూర్ణముగా నీడేరినవి.

మక:-[ముందువైపుచూచి] ఓహో! అవలోకితా బుద్ధరక్షితలలాగున్నారు. కలహంసుఁడుగూడఁ గనఁబడుచున్నాఁడు. వీరు దూరమునుండియే మనమందఱ మిందుండుటఁ జూచి సంతోషముతో నెట్లు గంతులు వేయుచు వచ్చుచున్నారో!

[తరువాత అవలోకితా బుద్ధరక్షితలును గలహంసుఁడును
బ్రవేశించుచున్నారు.]

[అందఱు వేఱువేఱుగా నృత్యముచేసి సమీపించి ప్రణమిల్లి కామందకి నుద్దేశించి] జయభగవతి! కార్యనిధానే! [మాధవు నుద్దేశించి] జయ మకరందనందన! మాధవపూర్ణచంద్ర! భాగ్యశాలివై వర్ధిల్లుచున్నావు! [అందఱును జిఱునగవుతోఁ జూచుచున్నారు.]

లవం:- ఈమహోత్సవ సమయమందు సంతోషముచే గంతులు వేయనివా రెవరు?

కామం:- నిజమే. ఈవిధము - మహాద్భుతమై విచిత్రమై రమణీయమై యుజ్జ్వలమైన ప్రకరణ మెందైనను గలదా?

సౌదా:- ఇందులో నెక్కువ రమణీయమిది. మంత్రి భూరివసుదేవరాతులకుఁ దామిరువురు వియ్యమందవలెనని చిరకాలమునుండి యున్న కోరిక సంపూర్ణముగా నెరవేరుట.

మాల:- [తనలో] ఇది యెట్లు?

మక:- మాధ:- [కౌతుకముతో] దేవీ! జరిగినది యొకటియు దేవి సెలవిచ్చినది యొకటియును.

లవం:- [జనాంతికముగా] ఇప్పుడేమి సదుత్తరము చెప్పఁదగినది?

కామం:- (తనలోఁ బెడమొగముగా] ఇప్పుడు మదయంతికతోడి సంబంధము స్థిరపడినందున నందనునకుఁ గోపమువచ్చునేమోయను శంక మనకు వదలిపోయినదిగదా? [ప్రకాశముగా] వత్సలారా! జరగిన దొకటియు నీబిడ చెప్పిన దొకటియుఁగాదు. ఏమన వారిరువురును జిన్నప్పుడు విద్యార్థి యవస్థలో నీసౌదామినియెదుటనే "మనమపత్యము వియ్యమందవలయు"నని ప్రతిజ్ఞ చేసికొనిరి. ఇంక రాజుయొక్కయుఁ రాజపురుషునియొక్కయుఁ గోపమీవిధముగాఁ బరిహరింపఁబడ్డదిగదా?

మాల:- ఓహో! ఇదియంతయు నాకారగోపనమా?

మాధ:- మక:- ఓహో! మందొడఁబాటును వెనుకఁ దడఁబాటును! ఎట్లైననేమి మహాత్ములు కృతార్థులైనారు. ప్రత్యయవంతు లిప్పుడును కళ్యాణవంతులు.



కామం:- వత్సా!

మానిని, కోరికదీఱ ఘటిల్లినదివేళ ♦ కుంజరజీవుల పెండ్లియోగిక
వారలా పుణ్యమునన్ మఱి నాజత ♦ నంబున శిష్యుల క్లేశములన్
నేరుపుమై మదయంతిక యిప్పుడు ♦ నీసఖుతోడను గూర్పబడెన్
భూరిముదంబున నందఁగఁగల్గిరి ♦ భూరమణుండ

ఇంకను గోరఁదగినది కోరవచ్చును.

మాధ:- [సంతోషముతో] నాకింత
అయినను భరతవాక్య మిట్లుండుఁగాక!

మంగళమహా

మంగళముగావలెస ♦ మస్తభువనంబులకు ♦ మా
సంగులయిముక్తకలి ♦ సంగులయిసందభి ♦ షంగులయి
ల్భంగరహితంపుఁ బ్రతి ♦ భంగరముధర్మపరి ♦ పాలనము సేయవలె రాజుల్!
పొంగఁ బ్రజలుల్లమునఁ ♦ బుష్కలనువృష్టికలు ♦ వుల్ దఱిమియీవలె
సుఖంబుల్.

మ. మగనిం బ్రొత్తగ జేర్పనెంచిమగువన్ ♦ మానొప్పఁగా సేసి యా
సోగనుం జిన్నెలువన్నెలద్దడుగన్ ♦ సొంపెక్కఁగా దిద్దు బ్రా
ఘగతింబూని పునః పరిష్కృతము సా ♦ ట్యంపుం బ్రబంధంబు దీ
వింగదున్ మచ్చికనాదరింప బుధులన్ ♦ జేయొగ్గి ప్రార్థించెదన్.

గద్యము. ఇది శ్రీజనమంచి వంశపావన బ్రహ్మావధాని తనూభవవిబుధ
విధేయ వేంకటరామ నామధేయాంధ్రీకృతంబైన మాలతీమాధ
వంబను మహారణ్యప్రకరణంబునందు సర్వంబును
దశమాంకము — సంపూర్ణము.

శ్రీపరమేశ్వరార్పణమస్తు.

Printed at Lodhra Press, Madras, Q. H. M. S. 158 and Published
by J. Ramakrishna, Madras. T. P. No. E-146—250 copies 6/46.

కైలాసవాని

# జనమంచి వేంకటరామయ్యగారి

# గ్రంథములు

శ్రీ వేంకటరామయ్యగారు తెలుగులో కవి, పండితుడు, శాపదమే కాక ఆంగ్లములో మంచి కావ్యపరిచయము, వారి సంస్కృతికిగాను పెద్ద సంపత్తి.

• వారి కావ్య రచన, సరళము, భావాళము, ప్రసన్నము; సౌమ్య సుందరమైన భావములతో అలరారుతుంటుంది.

తరుమాలలో అది స్వతంత్రరచనయేమో అనిపించే సామగ్రి, వీరియొద్ద కొల్లట్టిది, తరుచుగా దొరకదు.

..................భారతి.

# నవకుసుమాంజలి

[ఖండకావ్యము లు] మదాసు విశ్వకళాపరిషత్తువారి విద్వాన్ పరీక్ష 1938 పాఠ్యగ్రంథము 1 0

# ఆంధ్రీకరణములు

| | |
|---|---|
| భవభూతి — మాలతీ మాధవము | 2 8 0 |
| (మదాసు విశ్వకళాపరిషత్తువారి బి యే. II 1948 పరీక్ష పాఠ్యగ్రంథము) | |
| భవభూతి — ఉత్తరరామచరితము | —— |
| రాజశేఖరుని — విద్ధసాలభంజిక | 1 0 0 |
| కాళిదాసు — మేఘసందేశము | —— |

---

జనమంచి రామకృష్ణ
1-డి, లలితాపురం వీధి
రాయపేట. మదాసు.

